

**పొలిమేర**

చిత్రకారుడు పి. వి. రామారావు—విశాఖపట్నం

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ



సంపుటము 51
సంచిక 45
11-7-56

## సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

దుర్ముఖి ఆషాఢ శుద్ధ చతుర్థి బుధవారం

# విషయానుక్రమణిక



ముఖచిత్రం : నందీప్రొడక్షన్స్‌వారి "సౌభాగ్యవతి"లో సావిత్రి.

| | |
|---|---|
| భూమి సంస్కరణల సంఘం సిఫార్సులు— | 3 |
| కామన్వెల్తు ప్రధానుల సమావేశం— | 4 |
| గీర్వాణ భాషాభ్యాసం—పి. గణపతిశాస్త్రి | 6 |
| రసదాశావస్తే—ఇసుకపల్లి దక్షిణామూర్తి | 11 |
| పథేర్ పాంచాలి (సీరియల్)—విభూతిభూషణ్ బెనర్జీ | 18 |
| గజదొంగ—జయంతి శ్రీరామమూర్తి | 20 |
| శ్రీమతులు - శ్రీయుతులు—అంగర సూర్యారావు | 24 |
| సినిమా— | 30 |
| అరుణవలయం—ఎడ్గార్ వాలెస్ | 36 |
| వనితాలోకం—పి. భానుమతి | 42 |
| వాచీదొంగ—రమేశ్ కుమార్ | 45 |
| సాగరగర్భంలో సాహసయాత్ర (సీరియల్)—జూల్స్ వెర్న్ | 49 |
| సింహము - గాడిద—ఉత్పల సత్యనారాయణాచార్య | 50 |
| మోసగింపబడిన రాజు—వి. యస్. రావు | 53 |

# భూమి సంస్కరణల సంఘం సిఫార్సులు

భూవసతికి గరిష్ఠ పరిమితులు నిర్ణయించినపుడు, ఆ పరిమితికి మించి ఉండే భూములను కౌలుదార్లు కొనుక్కునే వసతి కల్పించాలేతప్ప ప్రభుత్వం తీసుకోవడం మంచిదికాదని ఆంధ్ర రాష్ట్ర భూ సంస్కరణల సంఘంవారు తమ నివేదికలో సూచించారు మన రాష్ట్రంలో వ్యవసాయ విధానాల స్థితిగతులదృష్ట్యా, కౌలుదారీ పద్ధతిని రద్దుచేసివేయడం తగదని వీరు స్పష్టపరచారు ఎటొచ్చి, ఈ కౌలుదారీ పద్ధతినే మరింత కట్టుదిట్టంగా, క్రమబద్ధంగా రూపొందించి అనుసరించాలని సలహా ఇచ్చారు

అయితే, ప్రభుత్వం ఇందుకు ఇతఃపూర్వమే ప్రాతికూల్యం ప్రకటించింది ఈ రంగంలో దళారీలకు చోటులేకుండా, రాష్ట్రవ్యాప్తంగా రైత్వారీ విధానాన్ని ప్రవేశపెడుతూ శాసనం చెయ్యబోతున్నటు ప్రకటించడం విదితమే

ఈభూసంస్కరణల సంఘాన్ని ప్రకాశం మంత్రివర్గం 1954 ఆగస్టులో నెలకొల్పింది శ్రీ లక్కరాజు సుబ్బారావు దీనికి అధ్యక్షులు వీరు తమ నివేదికను గత అక్టోబరు 30 న ప్రభుత్వానికి అందజేశారు

ఈ సంఘంవారు భూవసతి విషయంలో రు. 250 శిస్తు చెల్లించే భూములు లేదా, 150 ఎకరాల విస్తీర్ణంగల భూమి (ఏది తక్కువ అయితే అది) గరిష్ఠప్రమాణంగా నిర్ణయించుకోవచ్చునని ఈ పరిమితికి పైబడ్డ భూములకు, వాటని సాగుచేసే కౌలుదార్లే సబబైన ధరకు కొనుక్కునే హక్కు నివ్వాలనీ సిఫార్సు చేసినట్లు తెలుస్తోంది

(ఈ గరిష్ఠపరిమితి సరికాదనీ, దీన్ని ఇంకా తగ్గించాలనీ ఈ సంఘం సభ్యుడు శ్రీ బి యస్ మూర్తి వ్యక్తిగతంగా తమ అభిప్రాయాన్ని యీ నివేదికలో ఉదహరించారట)

పోతే, ఇకనుండి, ఏ భూస్వామీ, ఈ గరిష్ఠ ప్రమాణానికి మించే భూమిని సంపాదించుకోకుండా ప్రభుత్వం నిషేధించాలని పొలం కొనగోలు ద్వారాగాని, వారసత్వం, లేదా దానం క్రిందకాని. ఇంతకుమించి పొలాలను సంపాదించకుండా చూడాలనీ వీరు పేర్కొన్నారు

ఈ గరిష్ఠ పరిమితి అనేది పచ్చికబీళ్ళకు, కాఫీ, టీ తోటలకు, ముఖ్యప్రాంతాలకు, మతసంస్థల ధర్మసంస్థల అధీనంలోని భూములకు, పాఠశాలలకు చెందిన పొలాలకు వర్తించదు

భూమిని సాధ్యమైనంత ఎక్కువగా సద్వినియోగం చేసుకోవాలన్న సూత్రాన్ని పురస్కరించుకొని, ఈ సంఘం గరిష్ఠ పరిమితులను నిర్ణయించారు. భూమి తక్కువగా ఉన్నప్పుడు, దానిపై రాబడి పెరుగుతుందనీ, భూమి ఎక్కువైనకొద్దీ క్రమక్రమంగా నికరాదాయంకూడా పెరుగుతుందని, అది అలా పెరగ్గా పెరగ్గా, ఇక, ఖర్చులే తప్ప రాబడి పెరగనిస్థితి ఏర్పడగలదని విదేశాలలో తేలిందనీ, అటువంటి స్థితి వచ్చినపుడు, అధికోత్పత్తిపట్ల ఉత్సాహం పసలి తగ్గిపోతుంది కాబట్టి ఈ గరిష్ఠ పరిమితి అవసరమనీ వీరు వివరించారు కొత్త పద్ధతులు అవలంబించి చూడడానికి కావలసిన పెట్టుబడీ, నలుగుర్ని ఆకట్టుకువచ్చి అంగుకు పూనకుని పెద్ద క్షేత్రాలు నిర్వహించగల నాథులు లేనందువల్ల, ఆపైన, నిరుద్యోగ నివారణావశ్యకత దృష్ట్యా యాంత్రిక పరికరాల వాడకం కూడనిది అయినందువల్ల మనదేశంలో సేద్యానికి పరిపాటి అయిన నాగలి, ఎద్దులనే దృష్టిలో ఉంచుకుని ఈ పరిమితిని నిర్ణయించారట మరొక విషయంకూడా ఉంది సేద్యం చేసుకునే వారిలో రాబడి తక్కువైతే ఇంకో పని ఏదైనా చేసుకుంటూ మరో నాలుగు రాళ్లు తెచ్చుకునే వారు తక్కువేనని వీరు అభిప్రాయపడ్డారు అందువల్ల, గరిష్ఠ పరిమితిని ఇంకా తగ్గించినటయితే, తెలివితేటలు ఉత్సాహం, ఉన్నవారంతా, దీన్ని వదలి ఇతర వృత్తులకు ఎగబడతారు అప్పుడు వ్యవసాయం అంతా ఉత్సాహ రహితుల చేతిలో పడి ఎగుగూ బొగుగూ లేకుండా పోయే ప్రమాదం వుంది అందువల్ల ఒకరైతు ఇప్పటి జీవన ప్రమాణం ప్రకారం సుఖంగా జీవనం గడపడానికి, ఆధునిక వ్యవసాయ విధానాలు అవలంబించడానికి సాలుకు మూడువేల రూపాయలు ఉంటే చాలుతుంది ఈలెక్క ప్రకారం పదిరూపాయలు శిస్తు కట్టే పల్లపు భూమి పాతిక ఎకరాలుంటే, సాలుకు మూడువేలు పలకవచ్చునని అంచనా మెరక భూమి గరిష్ఠప్రమాణం కూడా ఈ రాబడిని బట్టే ఉంటుంది

ఇంక దీనికి మించిన భూమిని కౌలుదారులకు ఇప్పించాలి తప్ప ప్రభుత్వం తీసుకోరాదని వీరివాదం ఒకవేళ ప్రభుత్వం అలా తీసుకొన్నా ఒరిగిపడేది మహా అయితే లక్ష ఎకరాలు మించదని అంచనా ఈ కాస్త భూమీ ఎవర్ని ఉద్ధరించడానికీ చాలదు

ఈ అదనపు పొలాలను కౌలుదారులు కొనడానికికూడా ఒక పద్ధతి సూచించారు. దీనిపై కేవలం క్రయ విక్రయదారుల (కౌలుదారు, భూస్వామి) ఒప్పందంపై ఖరారు కావాలి కాకపోతే, నిర్ణీత అధికారి ఒకరు ఆ ప్రాంతంలో పొలాల ధరలనుబట్టి సబబైన ధర కట్టాలి ఆ ధర మొత్తంమీద కౌలుకు 20 రెట్లకు మించి ఉండకూడదు. ధర కుదరగానే ముందుగా ప్రభుత్వం ఆ పొలం ఖరీదును భూస్వామికి నగదుగానో, బాండ్ల రూపేణానో, కొంత అలా కొంత

# ★ భూమి సంస్కరణల సంఘం సిఫార్సులు ★

ఇలాగే ఇచ్చేయాలి ఆ పైన కౌలుదారు నుండి ఆ డబ్బును పది దఫాలుగా రాబట్టుకోవాలి ఈ లావాదేవీలు భూమి తనఖా బ్యాంకుల ద్వారా నడిపిస్తే బాగుంటుందని సూచించారు ఈ కౌలుదారుడి కొనుగోలు హక్కు విషయంలో మరో విషయం పాటించాలి ఈ కొనుగోలువల్ల భూస్వామి కమతం 180 ఎకరాలకు, లేదా, 300 రూ||లు శిస్తు కట్టే భూమి విస్తీర్ణానికి (ఏది తక్కువైతే అది) తగ్గని పక్షంలోనే ఇందుకు అనుమతి ఇవ్వాలి మరో మినహాయింపు కూడా ఉంది గరిష్ఠ పరిమితికి మించిన పొలం, బహు తక్కువగా, ఒక వ్యక్తి లాభసాటిగా సాగుచేసుకోడానికి చాలనంతగా ఉన్న సందర్భాలలో, ఆ కొత్త భూమినీ, తీసుకోనవసరంలేదు. ఆ భూస్వామికే వదిలి వేయవచ్చును.

కౌలుదార్ల కమతాలకు కూడా గరిష్ఠ పరిమితులు సూచించారు దీనిప్రకారం, ఏకమతమూ, 100 రూపాయల శిస్తుకట్టే భూమి కన్న, లేదా, 60 ఎకరాలకన్న (ఏది తక్కువ అయితే అది) ఎక్కువ ఉండకూడదు.

కౌలుకి ఇవ్వకుండా స్వయంగా సేద్యం చేసుకునేటట్లయితే, ఒక్కొక్క భూస్వామి 750 రూ||ల శిస్తుకట్టే భూమి లేదా 450 ఎకరాల వరకూ ఉంచుకోవచ్చు అంటే ఇది మామూలు ప్రమాణానికి మూడురెట్లన్నమాట.

కౌలు విషయంలో కూడా ఈ సంఘం కొన్ని సిఫార్సులు చేశారు మొత్తం పంటనుబట్టి కౌలురేటు నిర్ణయించాలి ఇది నగదు రూపంలోనేకాక, వస్తురూపంలో కూడా ఇవ్వడాన్ని ప్రభుత్వం ఆమోదించాలి దీనికి గరిష్ఠపరిమితులు నిర్ణయించాలి కౌలురేటు వాణిజ్యపంటలకైతే నూటికి 45 వంతులు, కానివాటికి ఆయా ప్రాంతాలనీటివసతులనుబట్టి నూరింట 28 1/3 పాళ్లు నుండి 50 పాళ్లు వరకూ ఉండాలి అతివృష్టి అనావృష్టివంటి వాటివల్ల పంటలు దెబ్బతింటే, ప్రభుత్వం శిస్తురెమిషన్ ఇచ్చినట్టే, కౌలులో కూడా రెమిషన్ ఇప్పించాలి అది శిస్తురెమిషన్‌కు తగిన నిష్పత్తిలోనే ఉండాలి కౌలుకు కనీస కాలపరిమితి ఆరేళ్లు నిర్ణయించాలి పోతే, కౌలుదారుడు భూమిని స్వతంత్రించి బాగుచేయించడానికీ, దానికి పరిహారాలను భూస్వామినుండి రాబట్టుకోవడానికీ అధికారం ఇస్తూ ఒక చట్టం చేయాలని కూడా సిఫార్సు చేశారు. ఏయే సందర్భాలలో భూస్వామి కౌలును రద్దుచేయవచ్చునో కూడా వీరు పేర్కొన్నారు.

చిన్న చిన్న భూఖండాలను ఏకంచెయ్యడానికి ఇప్పుడు చట్టాలు తలపెట్టడం సాగిరాదు పొలాలు మరీ చిన్న చీలికలుగా ఉంటే, మెట్టపొలాలు మూడుఎకరాలకు, పల్లపుభూములు అర ఎకరానికీ తక్కువ ఉన్న సందర్భాలలో వాటిని కలపడానికి ప్రయత్నించవచ్చు ఇదికూడా బలవంతాన చెయ్యరాదట చిన్నకమతాలుండే ఒక ప్రాంతంలో, నూటికి 75 మంది కనక, సమష్టి వ్యవసాయానికి ఒప్పుకున్నట్లయితే అటువంటి ఏర్పాటు చేయించవచ్చునన్నారు. మిగతా పాతికమందికి, పరిహారాలు భూమిరూపంలోనో, నగదుగానో ఇవ్వాలన్నారు

ఉన్న భూవసతులను మున్ముందు ఇంకా చిన్నవిగా చీలగొట్టడాన్ని నిషేధిస్తూ శాసనం చేయరాదు దీనికి మార్గం సమష్టి వ్యవసాయం గురించి గట్టిగా ప్రచారంచేసి నచ్చచెప్పడమే పోతే, సేద్యంలో సహకారసంఘాల ఆదేశాలను నిర్బంధంచేయడం తగదు మూడింట రెండువంతులమంది ఒప్పుకుంటే ఫరవాలేదు సహకార వ్యవసాయ సంఘాలు విరివిగా నెలకొనడానికి అన్నివిధాలా ప్రోత్సాహం ఇచ్చి దోహదం చెయ్యాలి

సాగుకు లాయకైన భూములను, భూములు లేని పేదవారికి ఇచ్చి, సహకారపద్ధతులపై వ్యవసాయం సాగించడానికి తగు ప్రోత్సాహం ఇవ్వాలి బంజర్లను ప్రభుత్వం ఖర్చుపైనే సాగుకు లాయకీ చేయించాలి ఈ పనులను వ్యక్తులకుగాని, జాయింట్ స్టాక్ కంపెనీలకుగాని ఒప్పగించవచ్చును ★

# కామన్వెల్తు ప్రధానుల సమావేశం

లండన్‌లో సమావేశమైన కామన్వెల్తు దేశాల ప్రధాన మంత్రులు అంతర్జాతీయ పరిస్థితిని చర్చించారు. రష్యన్ రాజకీయాలలో ఇటీవల వచ్చిన మార్పులు, మధ్యప్రాచ్యంతోను, ఆర్థికంగా వెనుకబడిన తదితర దేశాలతోను వ్యాపార, రాజకీయ, సంబంధాలను అభివృద్ధి పరచుకోవడానికి రష్యా చేస్తున్న ప్రయత్నాలను వీరు చర్చించారు సహజంగా, వీరిలో వీరికి ఈ విషయంపై ఏకాభిప్రాయం కుదరడం కష్టం కామన్వెల్తు దేశాలలో ఏదో కూటమికి కట్టుబడి ఉన్న దేశాలు, ఏ కూటమికీ చెందకుండా తటస్థంగా ఉన్న దేశాలు ఉన్నాయి మరికొన్ని దేశాలు కేవలం రష్యన్ వ్యతిరేకతా దృక్పథంనుండే వ్యవహరించేవి ఉన్నాయి రష్యాలో మార్పులేవీ రాలేదనే అభిప్రాయం దక్షిణాఫ్రికా వెల్లడించగా, పూర్వపు రష్యన్ రాజనీతికీ ఇప్పటి రాజనీతికీ తేడా ఉన్నదనీ, తేడా ఉన్నా లేకపోయినా ప్రస్తుత పరిస్థితిలో రష్యాతో ఏవిధంగా వ్యవహరించాలో ఆలోచించవలసిన అవసరమైనా ఉందనీ భారత ప్రధాని అభిప్రాయపడ్డారు బ్రిటన్, కెనడాల ప్రధాన మంత్రులు రష్యాలో మార్పులు వచ్చాయని అంగీకరిస్తూనే ఆ మార్పులపట్ల తాము అవలంబించవలసిన విధానాల విషయంలో భిన్నదృక్పథాలు వెల్లడించారు మధ్యప్రాచ్య రాజ్యాలతో రష్యా పెంపొందించుకొనజూస్తున్న స్నేహ సంబంధాలను కూడా బ్రిటన్ మొదలయిన దేశాలు అనుమానంతో గమనిస్తున్నాయి మధ్యప్రాచ్యంలో రష్యా ఆసక్తివలన తన పరిశ్రమలకు ముఖ్యాధారమైన నూనె సంపదకు ఏ ముప్పు వాటిల్లుతుందోనని బ్రిటన్ భయపడుతున్నది రష్యా ఆయా వెనుకబడిన దేశాలతో ఏర్పరచుకుంటున్న వ్యాపార సంబంధాలవల్ల తమ వ్యాపారానికి తీవ్రమైన పోటీ ఏర్పడవచ్చునని కూడా బ్రిటన్ భయపడుతున్నది ఇక దూరప్రాచ్యంలో చైనాకు ఐక్యరాజ్యసమితి సభ్యత్వం ఇప్పించే విషయంతోను, చైనాను గుర్తించే విషయంలోను కూడా అభిప్రాయభేదాలున్నాయి బ్రిటన్, ఇండియా, పాకిస్తాన్ సింహళ దేశాలు చైనాను గుర్తించాయి. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, కెనడా, దక్షిణాఫ్రికా గుర్తించలేదు అమెరికా చైనా సంబంధాలు అభివృద్ధి అయ్యేవరకూ ఈ దేశాలు చైనాను గుర్తించే అవకాశం ఉన్నట్లు కన్పించదు ఈ కారణంచేత చైనాకు సమితి సభ్యత్వం కలిగించే సమస్యపై కూడా కామన్వెల్తు దేశాలలో ఏకాభిప్రాయం కుదరడం కష్టం

కాశ్మీర్ సమస్యను కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో చర్చకు తీసుకు రావడానికి వీలులేక పోయినా, పాకిస్తాన్ ప్రధాని ఆ సమస్యను మొత్తంమీద వదిలి పెట్టలేదు. భారత ప్రధానిమీద ఒత్తిడి తీసుకు రావడానికి ఆయన ప్రయత్నం చేశారు జనవాక్య నిర్ధారణకు భారతదేశం వ్యతిరేకిస్తున్నదని పాకిస్తాన్ ఆరోపణ కాని

పాకిస్తాన్ దౌర్జన్య వైఖరి అవలంబిస్తూ, సైనిక కూటాలలో చేరి, ఆ కూటాల మద్దతుతో కాశ్మీర్ ప్రజలపైన, భారత దేశం పైన ఒత్తిడి తేవడానికి ప్రయత్నిస్తున్నంత కాలమూ కాశ్మీర్ లో స్వేచ్ఛగా, నిష్పక్షికంగా జనవాక్య నిర్ధారణ జరగడం అసంభవం. ఈ విషయాన్నే భారత ప్రభుత్వం స్పష్టం చేసింది. ఈ పరిస్థితిలో కాశ్మీర్ లో ప్రస్తుత యుద్ధ విరమణ రేఖను సరిహద్దుగా తీసుకుని విభజన జరపడం ఒక్కటే సమంజసమైన పరిష్కారంగా కనబడుతున్నది కాని పాకిస్థాన్ దుష్ప్రచారం బ్రిటన్ మొదలైన దేశాలలో బాగా పని చేస్తున్న సూచనలు కనిపిస్తున్నాయి దురాక్రమణ బాధ్యతను భారత దేశం పైకే త్రోయడానికి పాకిస్తాన్ తీవ్రంగా దుష్ప్రచారం సాగిస్తున్నది "టైమ్సు" వంటి బ్రిటిష్ పత్రికలు ఈ ప్రచారాన్ని ఆధారం చేసుకుని భారత దేశం పాకిస్తాన్ పై దురాక్రమణ వాంఛ కలిగి ఉన్నదనే టంతవరకూ వెళ్ళాయి. ఈ ప్రచారాన్ని అరికట్టడానికి భారత ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. కాశ్మీరు వివాదం యొక్క అసలు చరిత్రను, పాకిస్థాన్ సాగించిన దౌర్జన్యకాండను విదేశాలలో ప్రచారంచేసి భారతదేశం పైగల అపోహలను తొలగించడానికి తీవ్ర చర్యలు తీసుకోవాలి.

కామన్వెల్తు సమావేశంనుండి ప్రధాని నెహ్రూ మొదట అనుకున్న ప్రకారం అమెరికా వెళ్ళి అమెరికన్ అధ్యక్షునితో ముఖాముఖి చర్చలు జరపవలసి ఉన్నప్పటికీ, శ్రీ ఐసెన్ హోవర్ అనారోగ్య కారణంగా అది సాధ్యపడలేదు. ఇది చాలా విచారకరమైన అంశం. అంతర్జాతీయ రాజనీతిలో అమెరికా భారతదేశాలకు తీవ్రమైన వైరుధ్యాలు సంభవిస్తున్నందువలన భారతదేశానికి అమెరికాలోను, అమెరికాకు భారతదేశంలోను పలుకుబడి దెబ్బతింటున్నది. భారతదేశం ఏకూటమిలోను చేరకుండా తటస్థంగా ఉండడం అమెరికాలోని కొన్ని వర్గాలకు ఆగ్రహకారణమైనది. అమెరికన్ విదేశాంగ మంత్రి శ్రీ డలెస్ తటస్థ విధానం అవినీతికరమైనదని కూడా వ్యాఖ్యానించారు దీనికి వ్యతిరేకంగా శ్రీ ఐసెన్‌హోవర్ తటస్థంగా ఉన్న దేశాలకంటె సైనిక కూటాలలో చేరిన దేశాలకే ప్రమాదం ఎక్కువ అని లోగడ ఒక అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ విధంగా తటస్థ విధానం పట్ల అమెరికాలోనే భిన్నాభిప్రాయాలున్నాయి రష్యాలో జరిగిన మార్పులు, తదితర మధ్య ప్రాచ్య, దూరప్రాచ్య పరిస్థితులు, ప్రపంచ శాంతి, అణ్వస్త్రాల నిషేధం, నిరాయుధీకరణం మొదలైన అనేక సమస్యలపై అమెరికా, భారత దేశాల నాయకులు ప్రత్యక్షచర్యలు జరిపి ఉంటే ఉభయదేశాలలోనూ గల అపోహలు చాలా వరకూ తొలగిపోయే అవకాశం ఉండేది. భారత ప్రధాని తమ తటస్థ విధానం శాంతికి ఏవిధంగా దోహదం చేయగలిగేదీ నిరూపించడానికి అవకాశం కలిగేది ఈ అవకాశం ముందు ముందు కలిగినా అది సంతోషించవలసిన విషయమే 

# గీర్వాణ భాషాభ్యాసం

(గత సంచిక తరవాయి)

3

శర్వవర్మ అంతఃపుర పరిచారికల నింకా కొంతమందిని పిలిచి తరిచితరిచి ప్రశ్నించడంవల్ల విచిత్రమైనవిషయాలెన్నో బయటపడ్డాయి సేవంతికకు, మల్లికకు వైనుస్యాలేర్పడడం శర్వవర్మకు సులభంగానే అవగాహన అయింది అయితే చిన్న రాణి లీలావతీదేవి కంతటి గీర్వాణం బలిసి పోవడమే అంతనికంతగా అవగాహనకాలేదు దానికి చక్రవర్తి ప్రేమానురాగాలే ప్రధానకారణమై ఉండవచ్చుననీ, వాని మూలంగానే ఆమె అంతగా విర్రవీగుతున్నదనీ అతడు గ్రహించివేశాడు. అయితే ఇన్నాళ్లినించీ చక్రవర్తికిన్ని కళ్యాణమహోత్సవాలు జరిగినా పట్టమహిషి మలయవతీదేవి గౌరవాదరాల కెన్నడు ఎటువంటి లోపము కలగలేదు ఇప్పుడీ విధంగా ఆమె గౌరవానికి కొంతవరకు భంగం కలగడానికి గల కారణమేమో అతనికి బోధపడలేదు అటుపిమ్మట జలక్రీడోత్సవ సమయంలో చిన్నరాణి చేసిన అధిక్షేపానికి చక్రవర్తి అంత ఎక్కువగా ఖేదపడడానికి కారణమేమో కూడా అతనికి అవగాహన కాలేదు. క్రమక్రమంగా అదే అవగాహన కాగలదనీ వానిలో ఏదో దురవగాహమైన రహస్యం అంతర్గర్భితమై ఉండవచ్చునని శర్వవర్మ గ్రహించాడు. మొత్తంమీద పరిచారికలను కొందరిని తరిచి తరిచి ప్రశ్నించగా శర్వవర్మకు తెలిసిన జలక్రీడోత్సవ విశేషాలివి:

హాలసాతవాహన చక్రవర్తి రాణులందరితోను కలిసి వసంతోత్సవ వినోదాలలో మునిగి తేలుతూండగా క్రమక్రమంగా పొద్దు బాగా వాలిపోయింది వసంత సాయంకాల వేళ ఎండవేడిమి కొంచెం తగ్గినా ఆ ఉత్సవాలలో అలిసి సొలిసిన రాణులందరికీ హాల చక్రవర్తితో కలిసి జలక్రీడ లాడవలసిన సమయం సమాసన్నమైనదని అనిపించింది.

చక్రవర్తి అది గ్రహించి రాణులందరితోను కలిసి అంతఃపురోద్యానవన సరోవరంలో ప్రవేశించాడు. పట్టపురాణి మలయవతీదేవి కూడా వారందరితోను కలిసి సరోవరంలో ప్రవేశించిందిగాని లోలోపల ఆమె "చక్రవర్తికింకా చిన్నతనం పోలేదు! కాకపోతే ఇన్నేళ్ళు ముదిరినా ఇంకా ఈ జలక్రీడలేమిటి!" అని గొణుగుకొన్నది అయినా లోలోపలలేని ఉత్సాహం తెచ్చిపెట్టుకొని వారితో కలిసి మెలిసి జలక్రీడలలో ప్రవేశించింది

ఆసమయంలో సాంధ్యకాంతులు ప్రసరించిన సరోవరం అంతా రాణుల చెక్కిళ్ల కుంకుమ రక్తిమ వ్యాపించినట్లుగా తళతళలాడింది జలక్రీడా కోలాహలంలో సరోవరంలో పొంగిన తరంగాలతో బాటు తామరపూవులే కాక, రాణుల తల కట్టులుకూడా ఒయ్యారంగా నృత్యం చేశాయి రాణుల కర్ణాభరణాలలోను, తామరాకులపై చలించే నీటి బిందువులలోను సంధ్యా పద్మరాగ రత్నప్రభ బాగా విజృంభించింది మల్లిక, సేవంతిక సరోవర తీరంపై నిలబడి చక్రవర్తి సేవావసరాలకోసం

## ప్రాచీన గాథాలహరి

ఎదురు తెన్నులు చూస్తున్నారు

ఏ రాణితో కలిసి ఎక్కువగా వినోదించినా ఇతర రాణుల కటాక్ష వీక్షణాలెర్రబడగలవేమో అనే భయంతో సాతవాహన చక్రవర్తి అందరియెడల సమానానురాగమే ప్రదర్శిస్తూ అత్యంతచాకచక్యంతో జలక్రీడలాడుతున్నాడు అందులోను పట్టమహిషి యెడల మరింత అనురాగం ప్రదర్శిస్తున్నాడు.

చిన్నరాణి లీలావతి అది కనిపెట్టింది కొంచెం పక్కగా నిలబడిన అనంగలేఖ కేసి చూసి కన్నుగీటి చక్కని చిరునవ్వు చిందించింది

"లోలోపల లేని అనురాగాలు పైపైకి నటించడంలో చక్రవర్తి చాలా చతురులు సుమా!"

అనంగలేఖ కా మాటతో చెక్కిళ్ళెర్రబడ్డాయి లీలావతి పట్టమహిషిని ఎత్తిపొడవడానికే ఆ విసురు విసరింది కాని అనంగలేఖ అది తనమీదనే ప్రయోగించినదని అనుమానపడింది పిమ్మట ఒక పెద్దనిటూర్పు విడిచింది.

"ఆ! దీనిలో అంత విడూరం ఏమి ఉన్నదమ్మా! వారి ఇచ్చకాలన్నీ కేవలం మూన్నాళ్ళ ముచ్చటలే!"

లీలావతికీ మాట బాకులా పొడుచుకుంది.

"చక్రవర్తి మనసెరిగి మసులుకోలేని వారికలాగే అనిపిస్తుంది కాని వారు మీరనుకున్నంతటి చపలచిత్తులు కారు!"

"కాకేమి! కొంచెం ఓపికపడితే అన్ని ముచ్చటలు వాటంతట అవే బైటపడిపోతాయి!" అని అతి హేలగా నీటిలో ఒక్క మునుగు మునిగింది అనంగలేఖ

"అయితే సరే! అదేదో చూస్తానుగా!" అని లీలావతి నాగకన్యకలా నెమ్మది నెమ్మదిగా ఈదుకుంటూ చక్రవర్తిని సమీపించింది అక్కడ పట్టమహిషితో బాటుమరి ఇద్దరు రాణులుకూడా ఉన్నారు. అయినా ఆమె వారి నందరినీ నిర్లక్ష్యంగాచూచింది దోసిళ్లనిండా నీళ్లు నించి చక్రవర్తి ఊపిరితిరగకుండాముఖంపైవిసిరి కొట్టడం మొదలు పెట్టింది అది చూచి పట్టమహిషి, మిగిలిన రాణులు దిగాలు పడిపోయారు! అయినా లీలావతి తన ఔద్ధత్యం విరమించలేదు చక్రవర్తికొక నిమిషంవరకు ఊపిరే ఆడలేదు! అటుపిమ్మట మళ్ళీ కళ్లు తెరిచిచూచేసరికి లీలావతి మరి ఆపరిసరాలలో ఎక్కడా కనిపించలేదు హఠాత్తుగా తనకు తెలియకుండా నీటిలో ఎక్కడో మునిగివుండవచ్చునని ఊహించాడు చక్రవర్తి

అంతలో ఎదురుగా పదిబారల దూరంలో ఆమె ముఖం ప్రత్యక్షమైంది. మొట్టమొదట అది వేయిరేకుల తామరపూవేమో అనుకున్నాడు వెంటనే సరోవరతీరానికి సమీపంలో ప్రత్యక్షమైన ఆమె సమీపానికి చేరుకొని దోసిళ్లలో నించిన నీళ్లతో జలుపోరు ప్రారంభించాడు లీలావతికూడా శాయశక్తులా చక్రవర్తిపై నీళ్లు విరజిమ్మింది. పక్కనే సరోవర తీరంపై నిలుచున్న

పి. గణపతి శాస్త్రి



## తాండవనృత్యం

—ఫొటో: వి. దుర్గాప్రసాద్.

మల్లిక వారిద్దరూ తిరిగి కావేరి నీట ముత్యాలతలంబ్రాలతో వినోదిస్తున్నట్లుగా ఉన్నారనిఅనుకొని వారి పరస్పరానురాగానికి హృదయంలో ఎంతైనా మురిసిపోయింది!

అంతఃపురంలో జరిగిన విచిత్ర విశేషం యావత్తూ ఆ క్షణంలోనే జరిగిపోయింది లీలావతి చిట్టచివరి కా జల్లు పోరాటంలో పరాజితురాలై మరి ఊపిరి సలపక చక్రవర్తితో గీర్వాణవాణి లో "మోదకైస్తాడయ! మోదకైస్తాడయ!" అని మూడుమారులు మొరపెట్టుకొన్నది పిమ్మట చక్రవర్తి తీరంలో నిలుచున్న మల్లికతో వెంటనే మోదక భక్ష్యాలు తీసుకొనిరమ్మని ఆజ్ఞాపించాడు జల్లు పోరాటంలో ఊపిరి సలపక తికమకపడుతున్న లీలావతి కా ఆజ్ఞ వినిపించలేదు

ఆమె కొంచెం సేపదిరి కళ్లు తెరిచి నలువైపులా తిలకించేసరికి మల్లిక సరోవరతీరం మీద మోదక భక్ష్యాల పళ్లెరంతో ప్రత్యక్షమైంది

అది చూడగానే లీలావతికి కోపావేశం అంతా ఒక్క క్షణంలో అదృశ్యమై అయిపోయింది "అయ్యో! చక్రవర్తికి మాత్రం సామాన్య సంస్కృత జ్ఞానంకూడా లేకపోయె నే!" అని కొలని సోపానాలపై కూలబడి అదేపనిగా విరగబడినవ్వడం మొదలు పెట్టింది! ఆ సరాగంతో ఆమె అర్ధనగ్న శరీరసౌందర్యం వేయి మడుగులినుమడించింది!

కొంతదూరంలో నిలబడి ఆజలు పోరు ఏడూరం అంతా విస్తుపోయి తిలకిస్తున్న పట్టపురాణి మలయవతికి లీలావతి కేవలం తనవైపే చూచి తన్నే పరిహసిస్తున్నట్లనిపించింది!

అంతే! ఆమె మరి అక్కడ ఒక్క క్షణమైనా నిలబడలేకపోయింది పరిచారిక సేవంతిక వెంటరాగా వెంటనే తన ప్రాసాదంలోనికి తరలిపోయింది

చక్రవర్తికా క్షణంలో తాను చేసిన తప్పిదం అంతా బోధపడిపోయింది అయితే ప్రభువులకు తాముచేసిన తప్పిదాలు పరిచారకులపై నెట్టివెయ్యడం ఒక పరిపాటి కనక, మల్లిక తన మాట తిన్నగా వినిపించుకోలేదని, ఆమోద ద్రవ్యాలు—అనగా పరిమళద్రవ్యాలు—తీసుకొనిరావలసిందని ఆజ్ఞాపిస్తే పొరబడి మోదక భక్ష్యాలు తీసుకొనివచ్చినదనీ అన్నాడు

అయితే చక్రవర్తి స్వయంగా మోదక భక్ష్యాలు తీసుకురావలసిందని ఆజ్ఞాపించడం మల్లికే గాక ఆపరిసరాలలో నిలబడిన మరి ఇద్దరు రాణులకుకూడా విస్పష్టంగా వినబడింది చక్రవర్తి అవిధంగా మాటమార్చి తమ తప్పిదంఅంతా తన పరిచారికపై నెట్టివేసిన సంగతి గమనించి లీలావతి మళ్లీ మరింతగా విరగబడి నవ్వింది! ఎంతగా నటించినా ఆ సమయంలో చక్రవర్తి ముఖంలో కళాకాంతులన్నీ ఒక్కసారిగా మటుమాయమైపోయాయి!

ఆ తరక్షణంలో మళ్ళీ కోలుకున్నా చక్రవర్తి ముఖంలో ఆ పూర్వోత్సాహం మరింక రేకెత్తలేదు

అది చూచి మిగిలిన రాణులు చల్లచల్లగా జలక్రీడ విరమించేశారు అటుపిమ్మట చక్రవర్తి అక్కడనించి తరలిపోగానే వారు కూడా తమ తమ ప్రాసాదాలకు మరలి

# ★ గీర్వాణ భాషాభ్యాసం ★

పోయారు. వెనువెంటనే లీలావతికూడా మల్లికతో కలసి తన ప్రాసాదానికి వెళ్లి పోయింది.

చక్రవర్తి తన శయ్యాగారంలోనికి వెళ్ళి విశ్రమించి "సామాన్యమైన గీర్వాణభాషా పరిచయంకూడా లేకపోవడం వల్లనే గదా! ఈనాడింతగా కించపడవలసి వచ్చింది!" అని అదేపనిగా మథనపడ్డాడు.

చక్రవర్తి లీలావతిపై అదేపనిగా నీళ్లు చల్లినప్పుడామె ఊపిరి సలుపక "మోదకైస్తాడయ!" అని ప్రార్థించి, తన గీర్వాణ భాషా వైదుష్యం అంతా వెళ్లగక్కింది. 'మా - ఉదకైః - తాడయ' అంటే నాపై నీళ్లు చల్లవద్దు! అని అర్థం. కాని చక్రవర్తికి మోదకైః అనే పదంలో మా-ఉదకైః అనేరెండు మాటలకు సంధి జరిగినవిషయం బోధపడలేదు! మోదకైఃఅనేది ఒకేసంస్కృత పదమని భావించి వెంటనే మల్లికను పంపించి మోదకభక్ష్యాలు తెప్పించాడు!

లీలావతి విరగబడి నవ్వడం గమనించి తుణకాలం ఖిన్నుడై తన తప్పిదం అంతా అవగాహన చేసుకున్నాడు. వెంటనే ఆ తప్పిదం కమ్మకొన్నాడు. కాని అంతగా ప్రయోజనం కలగలేదు!

ఈవిషయం అంతా అంతఃపురపరిచారికల ద్వారా సంగ్రహించిన శర్వవర్మకు చక్రవర్తి ఆనాటి రాత్రి మరి భోజనంకూడా చెయ్యలేదనీ ఎందుకో మథన పడుతున్నారనీ తెలియగానే "గ్రంథం అంతా మహా మాంచిపాకంలోపడిందే!" అని ధీమాగా తల పంకించి "సాధు! సాధు!" అనుకొన్నాడు!

## ౪

అనంతరం కొన్నాళ్లవరకు మహామాత్యుడు గుణాఢ్యునికికూడా చక్రవర్తి సందర్శనభాగ్యమే కరవైపోయింది హాలచక్రవర్తి జనకునికాలం నించీ గుణాఢ్యుడు సాతవాహన సామ్రాజ్య మహామాత్యపదవి అత్యంత చాకచక్యంతో నిర్వహిస్తున్నాడు. ఇంత కాలంనుంచీ తానై కోరినప్పుడు అతని కెన్నడు చక్రవర్తి దర్శనం లభించక పోవడమనేది జరిగి ఉండలేదు!

"అయితే ఇన్నాళ్లకిటువంటి ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయి మరి! "అని సంభాళించుకొన్నాడు మహామాత్యుడు.

కాని వెంటనే ఆ విషయం విస్మరించి ప్రాకృతగాథాపరిశీలనలలో మునిగిపోయాడు. ఆ గాథలు పరిశీలిస్తూంటే గుణాఢ్యునికి ప్రాకృత బాణిలో నూతనంగా దివ్యకవితా ప్రాదుర్భావం జరిగినట్టనిపించింది ఆ నూతన కవితా విర్భావం వాల్మీకి మహర్షికి జరిగిన 'మానిషాద' మహా కవితా విర్భావంతో సరి పోల్చదగినదని అతని అభిప్రాయం!

గుణాఢ్యుడు మహామాత్యుడుగానే గాక మహాకవిగాకూడా సాతవాహన సామ్రాజ్యంలో అంతటా ప్రసిద్ధి వహించాడు. అతని విశాల నేత్రాలెప్పుడూ,కవితా భావలోనే విహరిస్తూంటాయనీ, రాజ్యతంత్రం నిర్వహణంలో అతని కంతగా చాకచక్యం లేకపోవడాని కదే కారణమనీ శర్వవర్మ అప్పుడప్పుడనుకుంటూండడం కద్దు. అంతలోనే రాజకంచుకి మహామాత్యుని సన్నిధికి వచ్చి సవినయంగా చేతులు జోడించి నిలుచున్నాడు. గుణాఢ్యుడతనివైపు జిజ్ఞాసార్థకంగా చూచాడు

"చక్రవర్తికింకా శిరోవేదన అలాగే ఉన్నదట!" అన్నాడు కంచుకి.

"మరి దర్శనంమాట?"

"అదే తేలడంలేదు!"

"అభ్యంతర మందిరంలో ఆయన సన్నిధిని ఇంకెవరు లేరా?"

"లేకేమి! అమాత్యులు శర్వవర్మ వారి సన్నిధినే ఉన్నారే!"

"ఎప్పటినించి?"

"నేటి మధ్యాహ్నంనించి"

"ఓహో అలాగా!" అని మహామాత్యుడు కంచుకిని పంపించివేశాడు తనకు దర్శనమే లభించకపోవడము, శర్వవర్మ చక్రవర్తి సన్నిధినే ఉండడము గుణాఢ్యునికెంతో విడ్డూరంగా కనిపించాయి. ఏమైనాసరే! ఓకమారు సార్వభౌమ సందర్శనం సంపాదించి తీరాలని నిశ్చయించి వెంటనే చక్రవర్తి భవనానికి బయలుదేరి వెళ్లాడు.

స్వయంగా గుణాఢ్య మహామంత్రి తన సందర్శనానికి విచ్చేసిన తరవాత చక్రవర్తి కింక దర్శనమీయక తప్పలేదు.

మహామాత్యుడు లోపలికి వెళ్లేసరికి చక్రవర్తి హంసతూలికా తల్పంపై శయనించి శర్వవర్మతో ఏదో మంత్రాంగం సాగిస్తున్నాడు శర్వవర్మ సమీపంలో విదూషకు డింకొక సుఖాసనంపై కూర్చుని చక్రవర్తి ప్రసంగం శ్రద్ధగా ఆలకిస్తున్నాడు.

గుణాఢ్యుడు లోపలికిరాగానే శర్వవర్మ కొంచెం లేవబోయినట్లు నటించి మళ్లీ అలాగే కూర్చుండిపోయాడు. గుణాఢ్యుడు విదూషకునికేసి నిశితంగా చూచాడు.

"చక్రవర్తి దృష్టిలో నాకు విదూషకుడు విశ్వంభర శర్మకున్నంత గౌరవంకూడా లేకపోయినదన్నమాట! అప్పుడే వ్యవహారం బాగా విషమసంధిలో పడ్డట్టున్నదే! ఇటీవలనే గదా! ఎంతో ఆప్యాయంగా పిలిచి గాథా రత్న పరీక్ష చెయ్యవలసిందని సెలవిచ్చారు! ఇంతలోనే ఏమిపుట్టి మునిగిందో మరి!" అని అనేకవిధాలుగా ఆలోచించాడు.

గుణాఢ్యుడు చక్రవర్తి దేహస్వాస్థ్యం విషయంలో కుశల ప్రశ్న చేశాడు. హాల సాతవాహనుడటువంటి అస్వాస్థ్యమేమీ లేదన్నట్టుగానే ముక్తసరిగా మూడు మాటలతో సమాధానం ఇచ్చాడు ఆ సమాధానం గుణాఢ్యునికి మరింత ఆశ్చర్యం కలిగించింది.

అటుపిమ్మట కొంత సేపటి వరకు ఎవరి నోట ఒక్కమాటైనా వెలువడలేదు మధ్యాహ్నం మూడు యామాలు గడిచిపోయిన సూచనగా వైతాళిక లప్పుడే మంగళ పాఠాలారంభించారు. గుణాఢ్యుడు దూర దూరంగా వినవచ్చే వారి గానలహరిలో తన్మయుడై చేతివేళ్లతో తాళం వేస్తున్నాడు. అంతలోనే చక్రవర్తి గుణాఢ్యుని వైపు చూచాడు:

"అయితే, దేవభాషాభ్యాసం చాలా దుష్కరమని అంటారే! అది తథ్యమేనా!" అని ప్రశ్నించాడు.

గుణాఢ్యుని కసలీ ప్రశ్న ఉదయించడానికి గల కారణమేమో బోధపడలేదు! అదీగాక సాతవాహన చక్రవర్తు లెక్కువగా ప్రాకృత భాషాభిమానులు అందులోను హాల చక్రవర్తి ప్రాకృత గాథాభిమాని. అటువంటి చక్రవర్తి కీవిధమైనజిజ్ఞాస కలగడానికి హేతువేమా! అని గుణాఢ్యుడనేక విధాలుగా ఆలోచించాడు. అయితే వెంటనే ఏదో సమాధానం చెప్పాలి కనక యాదాలాభంగా అన్నాడు:

"దేవర వారన్నట్లు దేవభాషాభ్యాసం కొంచెం దుష్కరమే మరి!





# ఆరోగ్యవంతులైన జనులు ప్రతిరోజూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

**- అది ప్రతిదిన * మలినములోని క్రిములను కడిగివేయును !**




* మనకు ప్రతిదినం తార్సపడే మామూలు మురికిలో క్రిములున్నాయి మనలో ప్రతివారికీ యీ క్రిములవల్ల రోగాల ప్రమాదం వుంది అందుచేతనే చాలమంది ఆరోగ్యవంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగివేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.

L. 261 X52 TL

భారతదేశంలో తయారుచేయబడినది

## ★ గీర్వాణ భాషాభ్యాసం ★

చక్రవర్తి ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు. గుణాఢ్యుడు మళ్ళీ అందుకొన్నాడు:

"మహా ప్రభూ! నేను వారాణసిలో పన్నెండేళ్ళ పాటత్యంత్యక్లిష్టమైన గురుకుల వాసం చేసి దేవవాణి అధ్యయనం చేశాను. అయితే ఇన్నాళ్లు ఇంతగా గాఢపరిశ్రమ చేయగా చేయగా నేను తెలుసుకొన్న దేమిటంటే-దేవవాణిలో నాకుండుకున్న పాండిత్యం కేవలం అత్యల్పమని మాత్రమే! అది సాక్షాత్తు దేవతావాణి గదా! అందువల్ల ఆభాషా వైదుష్యం అంత దుస్సాధ్యం!"

వెంటనే చక్రవర్తి సాభిప్రాయ వీక్ష శర్వవర్మ వైపు తిరిగింది:

"పూర్వకాలంలో పాణినీయ వ్యాకరణంతో దేవభాషా పఠనం బాగా క్లిష్టమైన మాట నిజమేగాని నేటికాలపు ఇంద్రచంద్ర వ్యాకరణాలతో అది కొంచెం తేలికపడింది. అది ఇంకా సుగమం చెయ్యవలెనన్న దృష్టితో నేనొక నూతన వ్యాకరణం రచించాలని కూడా సంకల్పించాను" అన్నాడు శర్వవర్మ. "ఔరా ఎంతటి సాహసి! ఇతగాడు గుండెలుతీసిన బంటే!" అనుకొని గుణాఢ్యుడు చురుకుగా శర్వవర్మకేసి చూచాడు.

"అయితే గీర్వాణ భాషా పాండిత్యం ఎంతకాలంలో సాధించవచ్చు నంటారు?" అని సూటిగా ప్రశ్నించాడు చక్రవర్తి.

"నావంటి వ్యుత్పింనే బుద్ధి ఎన్నేళ్లు చదివినా అంతే! అది తమవంటి ప్రతిభావంతులు సాధించవలసిన ఘనవిషయం!" అన్నాడు విదూషకుడు.

గుణాఢ్యుని కిప్పటికీ ఈ ప్రశ్న ఎందుకు పుట్టిందో తెలియలేదు. అందుచేత ధైర్యంగా సమాధానం ఇచ్చాడు:

"కొంచెం వ్యుత్పన్నులయినవారా రాభాషా పాండిత్యం సులభంగా ఆరు సంవత్సరాల్లో గడించవచ్చును".

శర్వవర్మకు చక్రవర్తి హృదయంలో ఈ జిజ్ఞాస రేకెత్తడానికిగల కారణాలన్నీ బాగా తెలిశాయి కనక చక్రవర్తి దృష్టి తనపై పడడంతోనే తడుముకోకుండా అతికినట్లుగా అన్నాడు:

"మహామనుష్యులమాటకు అడ్డుచెప్పడానికి కొంచెం కించగానే ఉందిగాని, ఆ భాషా పాండిత్యం ఆరుమాసాల్లోనే సాధించవచ్చునని నా దృఢ నిశ్చయం!"

ఆ మాట వినగానే గుణాఢ్యుని ఆత్మ నిగ్రహం సడలింది. "అది బొత్తిగా గీర్వాణ సంప్రదాయం తెలియని వారన వలసినమాట! ఆరుమాసాల్లో ఆవాణిలో అక్షరజ్ఞానంకూడా కలగదు!" అన్నాడు గుణాఢ్యుడు దురుసుగా.

శర్వవర్మ ఆ ఎత్తి పొడుపుమాట కేమీ జంకలేదు. కాని కొంచెం చలించినట్లు నటించాడు: నట్టి అలసులు, మందులు అయినవారి మాట నేను చెప్పలేనుగాని, లేకపోతే ఆరు సంవత్సరాల కాలం కేవలం అనవసరం!"

చక్రవర్తి వ్యవహారం రసకందాయంలో పడిందని గ్రహించి గుణాఢ్య మంత్రికేసి తిరిగి అవహేళనగా నవ్వాడు:

"తాము మహాకవీశ్వరులు కనక ప్రతీ

(55-వ పేజీ చూడండి)



# తనదాకా వస్తే

అమ్మవారు వూళ్ళో స్వైర విహారం చేస్తోంది. ముద్దులాగా తిరుగుతున్న సుబ్బిగాడికి పొద్దుకుంకేటప్పటికి నూట నాలుగు డిగ్రీల జ్వరం. తెల్లవారేటప్పటికి వళ్ళంతా పొక్కు చూపింది. యింట్లో వాళ్ళంతా నానా కంగారు పడ్డారు.

ఆ మర్నాడు కోమటి వీధిలో సుబ్బిశెట్టికి అమ్మవారు చూపింది. ఆ కోయింట్లో సాయంత్రానికల్లా అతని భార్యకు జ్వరం... పొక్కులు.

ఇదిగో అంటే అదిగో అంటున్నారు. వూరంతా గగ్గోలుగా వుంది. ఎక్కడ చూచినా మసూచి యినప గజ్జెలతో వికృత తాండవం చేస్తోంది.

అప్పుడే ఒక మనిషి దాటి పోయాడని కూడా వార్త పాక్కింది. ఆ మనిషి ఎవర యిందీ ఆచూకీ దొరకలేదు. ఎవరికి వారు ఆ వార్తను ప్రచారంలోకి తీసుకుపోవటానికి యథాశక్తి కృషిచేస్తున్నారేగాని నిజాన్ని తెలుసుకోవటానికి ఎవ్వరూ ప్రయత్నం చెయ్యలేదు.

ఆ నోటానోటా ఆమాట పాకిపోయి మునసబుగారిదాకా పోయింది. ఆయన కూడా మొదట నమ్మలేదు. అసలు ఆ వూళ్ళోకి ఆ మహామ్మారి అడుగుపెట్టదని, పెట్టలేదని అతని గట్టినమ్మకం. ఏదో జాతర చేయిస్తూ కోరినంత జంతుబలి చేయిస్తూన్న తర్వాత ఆ మాత్రం అమ్మవారిని నమ్మడానికి వెను కాడాల్సిన అవసరం ఏముంది?

మునసబుగారికి ఆరోజు మధ్యాహ్నం నుంచి వళ్ళు వూదర తేలినట్లుగావుంది. సాయంత్రానికల్లా జ్వరం పేలిపోతూ వచ్చింది. అంత మొండిఘటమైన గలవాడికి కూడా ధైర్యం సడలిపోయింది.

ఊళ్ళో కొత్తగావచ్చి ప్రాక్టీసు పెట్టిన గోవిందరావు యిల్లు కదలటానికి భయప డ్డాడు. మునసబుగారికే వచ్చిన తర్వాత యింక మామూలువాళ్ళ సంగతి చెప్పేదే ముంది? అందులో యింగ్లీషు వైద్యం వంటె కెక్కించిన నాస్తికత్వంతో దేవుడిని రోజుకి పదిసార్లయినా తిట్టే డాక్టరు "దేవుడు అంటే అమ్మవారు కాదనీ, అమ్మవారంటే తన కెప్పటినుంచో గౌరవం వుందనీ" యిప్పుడు ఎవరికి ఏమి చెప్పుతాడు. అమ్మ వారికి ఆమాత్రం గ్రహించుకునే తెలివి తేటలు లేవనా? ఆరోజు సాయంత్రం డాక్ట రుకు కూడా జ్వరం వచ్చింది థర్మా మీటరుకంటే అతని కంగారు టెంపరేచరు ఎక్కువ చూపింది.

మునసబుగారు కంగారు పడిపోయారు. వూళ్ళోవున్న డాక్టరుకు కూడా జ్వరంవచ్చి పడిందాయె. అది దొంగజ్వరం అనీ, బయ టకు రావటానికి భయపడి దుప్పటి కప్పుకు పడుకున్నాడనీ వూళ్ళో ఒక వార్త మంచి ప్రచారంలోవుంది. మునసబుగారి చెవు ల్లోకి ఆ నీలాపనింద దూరినప్పటినుంచి మరీ చికాకు పడిపోయాడు. వంట్లో వోపిక వుంటే 'డాక్టరునుపోయి చావకొట్టి వచ్చే పని' అనుకున్నాడు.

మళ్ళీ ఎవరినో అమ్మవారు తీసుకు పోయిందని వార్త వచ్చింది. ఎవరయిందీ ఈసారీ తెలియలేదు. మునసబుగారు వూరంతా వెట్టివాళ్ళచేత వెతికించి వుప యోగం లేకపోవటం వలన విసిగి వేసారి పోయారు ఆఖరి ప్రయత్నంగా పక్క గ్రామంలోవున్న "జ్యోతిశ్శాస్త్ర పారంగతుడు", "విద్యా నారాయణ హరిః" యిత్యాది అయిన శ్రీమాన్ గోపస్వామి వారిని తిరు అగ్రహారానికి పిలిపించారు.

అమ్మవారిని శాంతింపచేయాలనీ, వూళ్ళో తిరిగి శాంతి నెలకొల్పాలనీ...ఈ రెండు ఖనులా అయిన తర్వాత "వుచిత సత్కారం" చేసి సాగనంపుతామనీ మునసబుగారు పంపిన కబురులోవుంది.

స్వామివారు విచ్చేశారు. నూటిగా మునసబుగారింట్లో విడిదిగారు. వారివెంట ఆయన ప్రథమ శిష్యుడూ (ఆయన ఒక్కడే శిష్యు డని ప్రతీతి ఒకటి వుంది) అతి ప్రేమపాత్రుడూ అయిన చిదానందస్వామి వారు కూడా వేంచేశారు. ఆయన యింకా తన పేరుకి బిరుదులు తగిలించుకో లేదని అంటారు.

మునసబుగారు గోపస్వామివారి పాదాలు కడిగి, ఆ నీళ్లు శిరస్సుమీద కొద్దిగా చిలకరించుకున్నాడు. స్వామివారు అతనివంక తీవ్రంగా చూసి,

'మునసబూ...నువ్వు ప్రభవనామ సంవత్సరములో గాదూ పుట్టింది...' అన్నాడు. మునసబుకు మూర్ఛ వచ్చినంత పనయింది.

'తమకెట్లా తెలిసింది స్వామీ' అన్నాడు మునసబు చిదానందస్వామి కల్పించుకోక తప్పలేదు

'స్వామివారిని ఎదురు ప్రశ్నలు వెయ్యక మునసబుగారూ ... వారికి ఆగ్రహం రాగలదు...'

మునసబు చెంపలు వాయించుకున్నాడు. గోపస్వామి కొన్ని నక్షత్రాల పేర్లు, రాసుల పేర్లూ చిదానందస్వామికి చెప్పాడు. చిదానందస్వామి చిటికెలో కాగితం నిండా అంకెలు వేసి, గుణించి 'తొంభై ఏడేళ్లు స్వామీ' అన్నాడు.

గోపస్వామి మునసబును దీవించాడు. ఆయుర్దాయం యింకా చాలావుంది కాబట్టి యిప్పుడే భయం లేదన్నాడు. మునసబుగారి ముఖంలో వెలుగు కనిపించింది. తేనెతో తినవలసిందని చెప్పి ఏవో పంచరంగుల మాత్రలు అయిదు పొట్లాలలో కట్టి యిచ్చాడు.

స్వామివారి ఖ్యాతి వూరంతా సూర్యుని వెలుతురులా చూస్తుండగానే వ్యాపించి పోయింది.

మునసబుగారు మనశ్శాంతితో నిద్ర పోయారు. తెల్లవారేటప్పటికి జ్వరం తగ్గిపోయింది. పోయిన వోపిక తిరిగి వంట్లోకి చేరింది. సుష్టుగా భోజనం చేసి స్వాముల వారిని అమ్మవారు చూపిన ప్రతి యింటికీ స్వయంగా తీసుకుపోయాడు. చిదానంద స్వామి తుణాలమీద ఆయుర్దాయం లెక్క వేసి చెపుతున్నాడు. చాలామంది కోలుకుం టున్నారు.

అందులో ఒక్కచోటు మాత్రం ఆయు ర్దాయం తక్కువగా కనపడింది. అసలు లెక్క ప్రకారం ఆ వ్యక్తి పది సంవత్సరాల క్రితం "బాల్యాన తన్ని వుండవలసింది" గోపస్వామిగారు దివ్యదృష్టితో ఆలోచించి

# ★ తనదాకా వస్తే ★

కిందటి జన్మలో పాపం కొంత మిగిలిపోవటం వలన ఆ తేడా వచ్చిందనీ, అంతకంటే అందులో విచిత్రం ఏమీ లేదని చెప్పాడు. ఆ వ్యక్తికి డెబ్భయి ఏళ్లు దాటినాయి. జ్వరం అంతగా లేదు. మర్నాడు తెల్లవారేటప్పటికి 'రా' అన్నాడు. స్వామివారి ప్రతిభ చూసి చాలామంది ఆశ్చర్యపోయారు.

ఒకరిద్దరు పోకిరీ వాళ్లు అతను గుండె ఆగి చచ్చిపోయాడనీ, దానికి కారణం గోపస్వామి పెట్టిన భయమేననీ, పోలీసు రిపోర్టు యిస్తామని బెదిరించారు. వాళ్లకి చాలా మంది కలిసి నచ్చచెప్పి శాంతింపచేశారు.

వూళ్లో పెద్ద యెత్తున జాతర జరిగింది. జ్వరంలేని మేకలూ, గొర్రెలూ, జ్వరం వచ్చిన యజమానులకోసం ఆత్మబలిదానం చేసినాయి. మెడలు తెగకోట్టుకున్న కోళ్లకు అంతే లేదు. తమ దేశంకోసం యిష్టంలేకపోయినా యుద్ధంలోకి పోయి ప్రాణాలు త్యాగం చేసిన వీరులు తప్పకుండా గుర్తుకొస్తారు. ఆ జాతరజరిగే చోటంతా రణరంగంలాగా వుంది. గొంగసారాయి తాగిన ఒక భక్తుడికి గణం పెరిగింది. స్వామివారు గడ్డం సవరించుకున్నారు. చిదానందస్వామివారు 'భళి భళి' అన్నారు.

గణాచారి గంతులు వేస్తున్నాడు. చేతిలో హారతికర్పూరం వెలిగించి పెట్టితే గణం నిజంగా పెరిగిందీ లేనిదీ తెలుస్తుందని కొందరు బుద్ధిమంతులు చెప్పారు. గణాచారి మండుతున్న హారతి కర్పూరం చూసి మరింత మండిపడ్డాడు 'నన్ను పరీక్షిస్తార్రా....' అని అరుస్తున్నాడు.

'స్వామివారు తన భక్తుడట. ఆయనకి కాస్త గౌరవంగా సన్మానం చెయ్యాలి..' మునసబు వప్పుకున్నాడు 'ఏది కోరినా కొనెను' అని వాగ్దానం చేశాడు

గణం దిగిపోయింది గణాచారి నోట్లో కొబ్బరినీళ్లు పోశాడు చిదానందస్వామి

గోపస్వామి ఆవూరు వచ్చిన నాలుగు రోజుల్లో చాలామందికి మనస్థిమితం చెడింది. పోకిరీవాళ్లు అక్కడా అక్కడా చేరి యిదంతా వట్టి మోసం అనీ, 'అమ్మవారికి తన ప్రజలమీద ప్రేమ వుంటుందనీ, పీక్కుతినదనీ ప్రచారం చేస్తూవచ్చారు 'పుర కుంకలకు ఏం తెలుస్తుంది. వుండేలు దెబ్బ' అని కొందరు పెద్దకుంకలు అనుకున్నారు.

అది సరిగ్గా ఆయనవచ్చి అయిదోరోజు. యథావిధిగా స్నానంచేసి వళ్లు తుడుచుకుంటుంటే వళ్లు వెచ్చగావున్నట్లు తోచింది. ఒక్కసారి గుండె జలదరించింది గోపస్వామికి. గబగబా చన్నీళ్ళు యింకా నాలుగుబిందెలు స్నానంచేసి తుడుచుకుని కూర్చున్నాడు. చన్నీళ్లు కంట్లోనుంచి వస్తున్న వేడిమిని అరికట్టలేకపోయినాయి.

చిదానందస్వామి పరిచర్య ప్రారంభించాడు. స్వామివారు అస్వస్థులుగా వున్నారని తెలియగానే ఎక్కడెక్కడివాళ్లువచ్చి పరామర్శచేసి పోతున్నారు. ఒకరిద్దరు అక్కడే వుండిపోయి అన్ని వసతులూ చూస్తున్నారు.

చిదానందస్వామి స్వామివారికి చెప్పకుండా కొన్ని చూర్ణాలు పళ్లరసంలో కలిపి యిచ్చారు జ్వరం తగ్గిపోవటానికి. సాయంత్రం కొంచెము సేపు జ్వరతీవ్రత హెచ్చింది చూర్ణం మార్చియిచ్చాడు చిదానందస్వామి గోపస్వామికి వళ్ళంతా పొక్కు చూపింది.

జ్వరతీవ్రతవలన గోపస్వామివారు ఏమేమో పేలుతున్నారు మునసబుగారికి కబురందింది. వెంటనే పరుగెత్తుకుంటూ వచ్చారు. వెంబడి పళ్లు తెచ్చారు

గోపస్వామి చిరుచాప మీద పడుకుని అటూ యిటూ దొర్లుతున్నారు. మునసబుగారు రావటంతోనే చిదానందస్వామి లేచి ఆయన కూర్చోవటానికి చోటు చూపించాడు.

'స్వామీజీ...ఎట్లా వుంది?' ఎవరడిగినా అదే ప్రశ్న. అందరికీ చిదానందస్వామి సమాధానం చెపుతున్నాడు 'ఆరోగ్యం బాగా క్షీణించి పోయిందని!'

'మొన్న నాకిచ్చిన చూర్ణం వాడకపోయారా?' చిదానందస్వామిని అడిగాడు మునసబు. ఆయన రహస్యంగా మునసబు చెవులో నోరుపెట్టి, 'వాడకేమండి...మునసబు గారూ...మూడు రోజులనుంచి వాడుతునే వున్నాను...పరిస్థితి విషమిస్తుందే గాని అనుకూలం కనపడం లేదు' అన్నాడు.

మునసబుగారికి చాలా విచారం కలిగింది.

'ఏమండీ స్వామివారి ఆయుర్దాయం లెక్కకట్టారా' చాలా రహస్యంగానే అడిగాడు మునసబు

చిదానందస్వామి ముఖం ఏడుపు చెవి అంత అయింది. గబగబా కాగితాలు తీసి అంకెలు గబగబ బరికాడు. ఆయన పుట్టిన వత్సరం ప్రమోదూతట.' కాగితాల మీద లెక్కప్రకారం ఆయుర్దాయం నిండుగానే వుంది. ఇంకా అయిదారేళ్లు దాకా ఈ భూమిమీద 'బియ్యం' వున్నాయని తేల్చారు. చిదానంద స్వామి ముఖంలో ఆనందం తొంగి చూసింది.

'స్వామీజీ మీకేం ఫరవాలేదు...' చిదానందస్వామి గట్టిగా విసురుతూ అన్నాడు.

గోపస్వామి విసుక్కుంటూ 'ఏం చేస్తున్నావు శిష్యా' అన్నాడు

'మీ ఆయుర్దాయం లెక్కగట్టానండి. అయిదేళ్లు దాకా మీకేం ఫరవాలేదు... ఇప్పుడు మీ కొచ్చిన భయం ఏమీ లేదు. స్వామి' చిదానందస్వామి గోపస్వామి గొణుగుడు పెడచెవిని పెట్టి చెప్పుకుంటూ పోయాడు.

'ఆయుర్దాయం లెక్కకట్టితే ఏమవుతుందిరా....ముందర మందు సంగతి చూడు' గోపస్వామి బాగా చికాకుగా అన్నాడు.

'మందు సంగతి చూస్తూనే వున్నాను స్వామీ... పంచమార్గ చికిత్స నిన్న ఉదయం నుంచి చేస్తునే వున్నాను' చిదానందస్వామి సంజాయిషీ చెప్పుకున్నాడు.

'ఆ చూర్ణాల్లో ఏముందిరా...పంచదార పొడితో ఈ రోగం ఏం నయమవుతుందిరా. పట్టణం పోయి వెంటనే పెద్ద డాక్టరును పిలుచుకురారా బాబూ' గొంతెత్తి అరిచారు గోపస్వామిగారు.

మునసబుగారికి మూర్ఛవచ్చినంత పనయింది. తనకూ, తనవాళ్లకూ పంచదార పొట్లాలతో నయమయిందనేటప్పటికి మరింత ఆశ్చర్యం వేసింది. చిదానందస్వామి ఆ మందులతోనే నయం చేస్తానని కూర్చున్నాడు. గోపస్వామి డాక్టరు కావాలని బిగ్గరగా అరుస్తున్నాడు.

మునసబుగారు చిదానందస్వామిని రెక్కపట్టుకు బయటకు లాక్కునివచ్చి డాక్టరును పిలుచుకు రావలసిన ఆవశ్యకతను గూర్చి నచ్చచెప్పాడు. రోగి నమ్మకం మీదనే రోగం నిమ్మళించటం వుంటుంది గాని మందులలోనూ, వైద్యులలోనూ ఏమీ వుండదని చెప్పాడు మునసబు. చిదానందస్వామికి పరాభవంగా వుంది. ఊళ్ళో వాళ్లందరికీ వాళ్ల మనశ్శక్తి వలననే నయమయిందిగాని తన వైద్యంలో ఏమీ లేదని తెల్పేటప్పటికి.

తరవాతి ఏమయిందో మన కనవసరము. చిదానందస్వామి పెద్ద డాక్టరును పిలుచుకువస్తే గోపస్వామికి భూమిమీద నూకలువున్న సంగతి నిజమవుతుంది లేకపోతే స్వర్గంలోకి పోయి అక్కడే నూకల సంగతి చూసుకోవలసి వస్తుంది ఒక్కమాట మాత్రం నిజం. గోపస్వామి చిదానందస్వామి మూర్ఖత్వం వలన దాటిపోతే, చిదానందస్వామికి కూడా భూమిమీద నూకలు లేకుండా చేసే బాధ్యత మునసబు తీసుకున్నాడు. ★




(గత అధ్యాయం తరువాయి)

కదిమిచెట్ల రేవులో దూరపు పట్టణాల నుంచి, ధాన్యం, ముత్తెపుగుల్లలూ, తాటాకులూ వేసుకువచ్చిన చాలా పడవలు వరుసగా కట్టివేసి వున్నాయి ఈ ముత్తెపుగుల్లల పడవ వాళ్ళు నదిలో వల విసిరారు. ప్రతి సంవత్సరం ఈ రోజుల్లో వాళ్లు ఈ గుల్లలు తీసుకురావటం మామూలు. నదిలో రెండు పడవలను దగ్గరగా నిలిపి ఆపారు అపూ ఒడ్డున కూర్చుని చూస్తున్నాడు—ఓ నల్లటి వ్యక్తి మాటిమాటికీ మునిగి గుల్లలు వెతుకుతున్నాడు. కాసేపటికల్లా పడవ ప్రక్కగా పైకి లేచి, చంకన సంచిలో వేసుకున్న రెండు మూడు గుల్లలు ఇసుక, బురద కడిగి పడవ మీదికి విసురుతున్నాడు. అపూ సంతోషంతో పటూకి చేతో చూపుతూ— "చూశావా? మునిగి ఎంతసేపు ఉన్నాడో? ఇలారా, ఒకటి రెండు అని లెక్క పెట్టి చూద్దాం ఎంతసేపు ఉంటాడో! నువ్వు అంతసేపు మునిగిఉండగలవూ?" అన్నాడు. ఒడ్డుమీది నుంచి నీటివరకు గరిక మొలచి ఏటవాలుగా ఉన్నచోట అక్కడక్కడ కొయ్యమేకులు పాతి పడవల్ని కట్టి, లంగర్లు వేశారు. ఈ నావికులు ఎన్ని ఊళ్లు దాటి వచ్చారో, ఎన్ని నదులు, కాల్వలు దాటి వచ్చారో! సాగర సంగమాలకి సమీప ప్రదేశాల్లో ఎన్నిచోట్ల సముద్రపు ఆటుపోటులకు తట్టుకుని వచ్చారో! ఆ సంగతులన్నీ వాళ్లదగ్గిర కూర్చుని అడిగి తెలుసుకోవాలని ఉంది అపూకి. వాడికి నదుల మీద, సముద్రాలమీద తిరగాలని మహాకోరికగా ఉంది. అంతకంటె ఇంకేమీ అక్కర్లేదు వాడికి. సురేష్ పుస్తకాల్లో వివిధ దేశాల నావికుల కథలు చదివినప్పటినుంచీ వాడికీ వాంఛ ఎక్కువయింది. అపూ-పటూ ఇద్దరూ పడవలదగ్గిర కెళ్లి, 'ఏయ్ పల్లెకారీ! ఈ తాటాకు లెలా ఇస్తారు? ఈ ధాన్యం పడవ ఎక్కడినుంచి వచ్చింది? ఏవూరది? ఎటు వైపున? ఇక్కడి కెంత దూరం? ఏయ్ పల్లెకారీ! అని అడగటం మొదలెట్టారు.

"అపూదా: మన చింతలతోపు రేవు దగ్గిరొక డింగీ చూసివచ్చాను. అందులో ఎక్కి కాసేపు తిరిగివద్దాం, రా" అన్నాడు పటూ.

ఇద్దరూ అక్కడికి వెళ్లి, కట్టేసి ఉన్న చిన్న డింగీని విప్పి, ఒక్క త్రోపు త్రోసి అందులో ఎక్కి కూర్చున్నారు. నీటిమీది నుంచి చల్లటి ఏటిగాలి వస్తోంది తీగెబచ్చలి పొదమీద కొంగలాంటి దేదో వాలిఉంది మైదానం ప్రక్కన కొందరు రైతులు ఉలవ చేలు దున్నుతున్నారు. కొందరు గడ్డికోసి మోపులు కట్టుకుంటున్నారు. సీమచింత చెట్ల మలుపులో దట్టంగాఉన్న పొదమీద నీటిగోరువంకలు రొద చేస్తున్నాయి. అస్తమయ వేళ తూర్పుదిక్కున రకరకాల మబ్బు తునకలు మనోహరంగా కన్పిస్తున్నాయి

అనువాదం:
## మద్దిపట్ల సూరి

"అపూదా, ఓ పాట పాడరాదూ! ఆరోజున పాడేవే అది!" అని అడిగాడు పటూ.

"అది కాదు. మా నాన్నదగ్గిర ఘణితి అంతా చక్కగా నేర్చుకున్న మంచిపాట ఒకటుంది, అది పాడతాను. కాని కాస్త దూరం అటుపోనియ్. ఇక్కడ ఒడ్డుమీద వాళ్లంతా ఉన్నారు, ఇక్కడ కాదు" అన్నాడు అపూ.

"నీకు ఎక్కడలేని సిగ్గు అపూదా! వాళ్లు ఎక్కడో అంత దూరాన ఉంటే నువ్వు పాడటానికేరా? పో. మొదలుపెట్టు" అన్నాడు పటూ.

కొంచెం దూరంవెళ్లాక అపూ గొంతు ఎత్తాడు. పటూ వెదురుచదర తెచ్చి, నావలో చదునుగాఉన్నచోట వేసుకుని, శ్రద్ధగాపాట వింటూ కూర్చున్నాడు. నావను నడపవలసిన అవసరం లేదు. ప్రవాహం వాలువపడి,'లా-భాంగా' మలుపువైపు పోతోంది. అపూ పాట సాంతం కాగానే పటూ ఒకపాట అందుకున్నాడు. అప్పుడు అపూ నడుప సాగాడు నావను. చాలా దూరంవచ్చింది నావ 'లా-భాంగా' మలుపు కన్పిస్తోంది అప్పుడే పటూ హఠాత్తుగా సైవన్‌వైపు వేలితో చూపుతూ "అపూదా! మబ్బు ఎలా కమ్ముకు వస్తోందో చూడు. ఇప్పుడే పెద్దగాలి వచ్చేటుంది. నావని వెనక్కి మళ్లిద్దామా?" అన్నాడు.

"వస్తేరానియ్, గాలి గాలిలోనే నడుస్తుంది నావ. పాట పాడుకుంటూ వెడుతూంటే బావుంది. ఇంకొంచెందూరం వెడదాం" అన్నాడు అపూ.

ఇలా మాట్లాడుకుంటూ ఉండగానే, మాధవపురం మైదానం వైపుగా నల్లటి మబ్బులు కొట్టుకువచ్చి, ఆకాశం అంతా కమ్మేశాయి. వాటి నల్లటి నీడ నది నీళ్ళలో కన్పిస్తోంది. పటూ ఆదుర్దాగా ఆకాశంకేసి చూస్తూ కూర్చున్నాడు. ఎక్కడో దూరాన్నుంచి జుయ్‌మని ధ్వని ప్రారంభమైంది. ఆ అస్పష్టమైన ధ్వనితోపాటు పక్షుల కలకలాలు ప్రారంభమయినాయి. చల్లగా నీటిగాలి కొడుతోంది. నేల ఎండి ఎండి తడిసిన వాసనవస్తోంది...చూస్తూ చూస్తూ ఉండగానే చెట్ల చివరలను ఊగించేస్తూ, కొమ్మలను విరిచేస్తూ పెద్ద గాలిదుమారం ప్రారంభమయింది.

నదిలో నీళ్లు నలుపెక్కాయి. ఒడ్డున ఉన్న చెట్లకొమ్మలు విరిగిపడేందుకు సిద్ధంగా

**జరిగినకథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తరవాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లల కిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కనిపిస్తుంది. బడి చదువుకూడా వాడికి ఏమీ అంటలేదు. ఇంట్లోనే తండ్రితాలూకు పుస్తకాలన్నీ చదివేస్తూ ఉండేవాడు. ఒకసారి వాళ్ల ఊళ్లోకి ఒకనాటక సమాజం వచ్చింది. వాళ్లువేసిన నాటకాలు చూసి అపూ తన్మయుడైపోయాడు. తనుకూడా పెద్దయ్యాక నాటక సమాజాల్లోచేరి నటుడైపోవాలని కలలు కన్నాడు. తను చూసిన నాటకం కథ ఆధారంగా స్వయంగా ఒక నాటకంకూడా రాసేశాడు. మొత్తానికి వాడి ఆదర్శాలకు ఆకాశమే అవధి. దుర్గకి మంచి సంబంధం ఏదన్నా చెయ్యాలని తల్లి ఆవేదన పడేది. కాని మంచిసంబంధాలనేవి హరిహరరాయ్ కుటుంబానికి ఎన్నటికీ అందని ద్రాక్షపండ్లే. ఎప్పుడో ఏదో అదృష్టం కలిసివచ్చి తమ సంసారం బాగుపడుతుందనీ, దుర్గ గొప్ప ఇంటి కోడలైపోతుందనీ, అపూ పెద్దవాడై ప్రయోజకుడై తమ కష్టాలు గట్టెక్కిస్తాడనీ ఆమె కలలు కనేది. కాని ఆ కలలు కల్లలుగానే మిగిలిపోయాయి.

ఒకసారి దుర్గకి జ్వరం పట్టుకుని ఎన్నాళ్ళకీ తగ్గలేదు. హరిహరుడు ఊళ్ళోలేడు. తల్లి, పిల్లలూ తిండికికూడా మొహం వాచిపోయారు. ఆఖరుకి ఒక భయంకరమైన రాత్రివేళ, వర్షం ప్రళయంగా కురుస్తున్నవేళ దుర్గ ప్రాణవాయువులు అనంతంలో లీనమైనాయి. ఆమె జనన మరణ, సుఖదుఃఖ ద్వంద్వాతీతమైన ఏదో అజ్ఞాతలోకానికి వెళ్లిపోయింది. హరిహరుడు ఊరినుంచి తిరిగి వచ్చినతరవాత గాని దుర్గ మరణం వార్త అతనికి తెలియలేదు.

## ★ పథేర్ పాంచాలీ ★

ఉన్నాయి. తెల్లటి కొంగల పిండు నల్లటి ఆకాశం క్రిందుగా వరుసగా ఎగిరిపోతున్నాయి. అపూ హృదయం వికసించింది. ఆ ఉత్సాహోద్వేగాల్లో చుక్కాని విడిచిపెట్టేసి, ఆ పెనుగాలికి తన్మయుడై కూర్చున్నాడు. పటూ ఒడిలోని గుడ్డను గాలికి ఎదురుగా పట్టుకు చేసరికి పెద్ద బుడగలా అయిందది.

"మరీ ఎదురుగాలి యిది అపూదా! నావ ఇంక ముందుకి పోలేదు. కాని ఒకవేళ తల క్రిందులయితే! ఇంకా నయం. సునీల్ని కూడా వెంట పెట్టుకు వచ్చాంకాదు!" అన్నాడు పటూ.

కాని అపూ పటూ మాట వినిపించుకోనే లేదు. వాడి చెవి-దృష్టికూడా అక్కడలేవు. వాడు నావమీద కూర్చుని, పెనుగాలితో ఉల్లోలితమై నదికేసి, ఆకాశంకేసి చూస్తున్నాడు. వాడి చుట్టూ చిందులు త్రొక్కుతున్న నల్లటి నదీ జలాలు, పైన ఎగిరిపోతున్న కొంగలపిండు, అల్లుకు పోతున్న మబ్బుల గుంపులు...దక్షిణ తీర నావికుల ముత్యపు గుల్లల ప్రోగుల్ని-ప్రవాహంలో కొట్టుకు వస్తున్న చెట్ల ఆకుల తెట్టెలు ఊడిచి పెట్టేట్లున్నాయి. తనను 'వంగవాసి' పత్రికలోని ఆ విదేశీయాత్రికునిగా ఊహించుకున్నాడు. తన నౌక కలకత్తా నుంచి బయలుదేరింది. వంగోపసాగరందగ్గరి-సాగరద్వీపాన్ని దాటి, సముద్రమధ్యంలో ఉన్న చిన్నచిన్న ద్వీపాలను ఎన్నిటినో దాటి, సింహళ ద్వీపం దగ్గర కొబ్బరి తోటల శోభను చూస్తూ, ఈ అద్భుతదేశంలోని సుందర పర్వతాలను దిగంతంలోకి నెట్టి, అస్తమయ సూర్యుని స్వర్ణకాంతులతో అభిషిక్తమవుతూ నూతన దేశాల్లోని క్రొత్త క్రొత్త దృశ్య పరివర్తనల మధ్యనుంచి వెళిపోతోంది. వెళిపోతోంది. వెళిపోతోంది... ఈ ఇచ్ఛామతీ నదీ జలాల్లాగానే నల్లగా, లోతుగా, కల్లోలంగా ఉన్నాయి ఆ దూరపు సముద్ర జలాలు కూడా. అరేబియా సముద్రంలోని ద్వీపాల్లో కూడా ఇక్కడ లాగానే పచ్చని చెట్లగుబుర్లున్నాయి. అక్కడ ఇలాంటి సంజెవేళ చెట్టుక్రింద కూర్చుని, ఏడెన్ రేవులో ఆ విదేశయాత్రికునిలా ఆ అరబ్బీ సుందరి చేతిలోంచి ఓ గ్లాసు మంచినీళ్లు అడిగి పుచ్చుకుని త్రాగవచ్చు. సీమచింతల మలుపుకేసి చూడగా ఆ పత్రికలో వర్ణితమైన ఓడవెనుక నీటిమీదనే ఎగురుతూ వచ్చే-ఆ జలచర పక్షుల గుంపు స్పష్టంగా కన్పిస్తున్నట్టే ఉంది.

తాను ఆ అన్నిచోట్లకూ వెడతాడు, అవన్నీ చూస్తాడు, విదేశాలకు వెడతాడు, వ్యాపారంమీద జపాన్ వెడతాడు, పెద్ద

వర్తకుడవుతాడు. ఎప్పుడూ ఓడలమీద విదేశాలకు వెడుతూంటాడు, గొప్పగొప్ప క్లిష్ట పరిస్థితుల్లో ఇరుక్కుంటూ ఉంటాడు. చీనా సముద్ర గర్భంలో ఇవాళ ఈ మనస్సును మత్తెక్కిస్తున్న పెనుగాలిలాంటి గాలే కొట్టి, తమ ఓడ మునిగేందుకు సిద్ధమైతే-'మా అపూర్వ భ్రమణం'లో చదివిన నావికులలాగా తాను కూడా 'జాలీబోట్' చేసుకుని, మునిగిన పర్వతాలకు పట్టుకుని ఉండే 'కప్పచిప్పల్ని' కాల్చుకుని తిని కాలక్షేపం చేస్తూ ఒడ్డుకు చేరుకుంటాడు... అదుగో, మాధవపురం చెరువుతోపు వెనక ఉన్న బూడిదరంగు మేఘపర్వతం కొంచెం ముందుకు వంగింది దానికి అవతలే ఆ నీల సముద్రం, కొబ్బరితోటలు, ఆగ్నేయగిరి, మంచుతుపాను రేగే ప్రాంతం, జయరేఖా, సరయూ, గ్రేస్ డార్లింగ్, జూట్ ఫిన్, బంగారం చేసే గారడీవాడు, నిర్జన ప్రదేశంలో ఆలోచనా నిమగ్నయై ఉన్న వినీల నేత్రి, గ్రామీణబాలిక అయిన జోన్ — ఇంకెందరో ఉన్నారు. తన రేకుపెట్టెలో ఉన్న పుస్తకాలుకొన్ని, రాణా గీదివాళ్ళ యింట్లో పుస్తకాలుకొన్ని, సురేష్ దాదగ్గర అడిగితీసుకున్న పుస్తకాలు, పాత వంగవాసి పత్రికలే తనకీ దేశదేశాల కథలూ చెప్పాయి. ఆ దేశాలు, అక్కడివాళ్లు తనకై యెదురు చూస్తూంటారనిపిస్తుంది. అక్కడినుంచి యెప్పుడో తనకు పిలుపువస్తుంది— తాను వెళ్ళాలి అక్కడికి!...

ఆ కేశాలన్నీ యెంతదూరాన ఉన్నాయో, అక్కడికి తనను ఎవరు తీసుకుపోతారో, తాను అక్కడికి వెళ్లటం ఎలా సాధ్యమో-అన్న ఆలోచన రాదు వాడికి ఇహ కొద్దిరోజులు పోయాక ఇంటింటా పూజలుచేయిస్తూ పొట్టపోసుకోవలసినవాడు, రాత్రిళ్లు చదువుకోటానికి దీపానికి చమురు కావాలంటే తల్లిచేత చీవాట్లు తినవలసివచ్చేవాడు, ఇన్నియేళ్లు వచ్చినా స్కూలుమొహం ఎరగనివాడు, మంచిగుడ్డలు, మంచివస్తువులు అంటే ఎలా ఉంటాయో తెలియని అమాయకుడు, అవ్యక్తుడు, సహాయసంపత్తులులేనివాడూ అయిన గ్రామీణ బాలకుని బృహత్తర జీవితానందంలో పాలు పంచుకోటానికి రమ్మని ఎవరూ ఆహ్వానించేది!

ఈ ప్రశ్నలన్నీ మనసులో రేకెత్తితే వాడి భావనారథ వేగం, ఆశాపూరితమైన జీవిత యాత్ర మీద వాడికి ఉన్న అణుచుకోరాని వ్యామోహం, సమస్త విఘ్న భయసందేహాల్ని జయించగలిగేవేమో! కాని వాడికి ఆలోచనలే తలయెత్తలేదు. వాడికి వచ్చే ఆలోచన ఇదే— పెద్దఅయితే చాలు. అన్నీ ఒనకూడుతాయి. ముందుకు సాగి పోగలిగితేచాలు, అన్ని అవకాశాలూ మార్గమధ్యంలో నే సమకూరుతాయి...పెద్దవాడవటం ఒక్కటే ఇప్పుడిహ తరువాయి! పెద్దఅయితే తనకి అన్ని సదవకాశాలు కలిసివస్తాయి. అన్ని వైపులనుంచీ అందరూ ఆప్యాయంగా పిలుస్తారు తనని. తాను ప్రపంచాన్నీ-ప్రజల్నీ అర్థంచేసుకున్నతరువాతే దిగ్విజయయాత్రకి వెడతాడు.

మనోహరమైన భవిష్యజ్జీవిత స్వప్నంలో మునిగి తేలుతూంటే ఆ మిగిలినదూరం కాస్తా దాటిపోయింది. వర్షంరాలేదిహ. ఆకాశంలోని మబ్బుల్ని అన్నిటినీ ఆ పెనుగాలి చెదరగొట్టేసింది. ఆకాశం నిర్మలంగా ఉందిప్పుడు. చింతలతోపు రేవులోకివచ్చి, నావ ఒడ్డుకు చేరంగానే వాడికొక మైకం వదిలింది. నావని కట్టేసి, ఆవెదురుచెట్ల దారి నే హుషారుగా ఈల వేసుకుంటూ ఇంటికి బయలుదేరాడు. వాడూ వాళ్ల అమ్మలాగా, అక్కలాగా కలలు కనటం నేర్చుకున్నాడు...

## 28

అప్పూ అసలు నిద్రపోలేదు. మేల్కొనే ఉన్నాడు. కళ్ళు మూసుకుని, పడుకుని వాళ్ళ అమ్మా నాన్నా మాట్లాడుకున్న మాటలన్నీ విన్నాడు. వాళ్లు ఇక్కడ కాపురం ఎత్తివేసుకుని కాశీ వెళ్ళిపోతున్నారు. ఇక్కడికంటె కాశీలో ఎంత సదుపాయంగా ఉంటుందీ నాన్న అమ్మతో చెపుతున్నాడు. నాన్న చిన్నప్పుడు అక్కడ చాలా కాలం ఉన్నాడు. అక్కడ అందరితోనూ నాన్నకు పరిచయం, స్నేహమూ ఉన్నాయి. అందరూ ఆయన్ని గుర్తించి గౌరవిస్తారు. వస్తువులుకూడా చాలా చౌక. అలాంటి బంగారు దేశంలో ఎవరికీ ఎప్పుడూ దరిద్రం అనేది ఉండదు. ఇక్కడేముంది, మున్నూట అరవై రోజులూ దరిద్రమేగా. ధైర్యంచేసి అక్కడికి వెళ్ళామంటే కష్టాలన్నీ గట్టెక్కినట్టే- అన్న భావాన్ని వెలిబుచ్చింది తల్లి. వీలైతే ఆవేళే వెళ్ళిపోదామనిఉంది ఆమెకి. ఇంక ఇక్కడ ఒక్క రోజుకూడా ఉండాలని లేదు. చివరికి వైశాఖ మాసంలో వెళ్లాలని నిర్ణయించుకున్నారు......గంగాసంతపూర్ లోని సిద్ధేశ్వరి ఆలయంలో పూజ చేయించటానికి మూడుక్రోసులు నడిచివెళ్లే వాళ్ళెవరున్నారు?— అంచేతనే ఇంతవరకూ ఆ మొక్కు అలా మిగిలిపోయింది. ఇప్పుడిహ ఈ ఊరు విడిచిపెట్టి వెళ్ళేలోపుగానైనా ఆ మొక్కు చెల్లించుకోవాలి. కాని ఎంత వెతికినా అక్కడికి వెళ్ళేవాళ్ళెవరూ దొరకలేదు. "నేను వెళ్లి పూజ చేయించివస్తాను. ఆ ఊళ్ళో అత్తకూడా ఉందిగా! వాళ్ళతో ఎప్పుడూ పరిచయం కూడా లేదాయె. వాళ్ళనికూడా చూసి వచ్చినట్లవుతుంది" అన్నాడు అప్పూ

"పోరా, ఆటే వాగకు. నువ్వ ఒక్కడివీ వెళ్లివస్తావు నే! ఎంతలేదన్నా నాలుగు క్రోసులుంది ఇక్కడికి ఏమనుకున్నావో!" అన్నది తల్లి.

 # పథేర్ పాంచాలి 

అపూ తల్లితో వాదం పెట్టుకున్నాడు. "నేనిహ యెప్పుడూ యిలాగే యింట్లోనే కూర్చుంటానా యేం? ఎక్కడికీ వెళ్లలేననేనా? నాకేం కళ్లు లేవా, కాళ్లు లేవా, చేతులేవా?"

—అన్నీ ఉన్నాయి. గంగానందపూర్ తనొక్కడూ వెళ్లిరాగలడు. గొప్ప ధైర్యశాలి కదూ!

చివరకు అపూ బలవంతంవల్ల వాడినే పంపటమయింది!

సోనాడాంగా మైదానాన్ని మధ్యనుంచి చీల్చుకుంటూపోయే నాటుదారి అది. దారికటూ ఇటూ ఒత్తి జిల్లేడు అడవి. తెల్లగా పొడుగ్గా ఉండే సన్నటికొమ్మలు పూలబరువుకి ఒరిగి క్రిందపచ్చిక మీద అనుకున్నాయి. దారి పొడుగునా ఎక్కడా పిట్టలేదు. మిటమధ్యాహ్నం కాలేదింకా. అపూ కాళ్లు క్రింద గరప నేల వేడికి కాస్త చురుక్కుమంటున్నాయి—చమ్మగా ఉంది వాడికి. దారిప్రక్కల్ని చెట్ల గుబురుల్లో ఏవో పూలు విరగ పూసివున్నాయి తుమ్మచెట్లకి, జమ్మిచెట్లకి క్రొత్తగా పూసినపూలు సూర్యుని కభిముఖంగా తిరిగి వున్నాయి. చిన్న చిన్న చెట్లకి ఏవో మేడిపళ్లలాంటి మెరిసిపోయే పళ్లు అపరిమితంగా వున్నాయి. క్రిందనుంచి ఎండిన నేల వాసనలేవో వస్తున్నాయి. వాడు మధ్య మధ్య వంగి పొదల్లో వెతికి వెతికి 'బైంచ్' పళ్లు కోసుకుని, చేత్తో కుట్టిన ఎర్ర సాటిన్ చొక్కా రెండు జేబులనిండా పోసుకుంటున్నాడు.

వెడుతూన్నకొద్దీ వాడిమనస్సు పులకితం కాసాగింది ఈ ఎండిన నేల వాసన, నీడలు ప్రాకిన పచ్చిక, సూర్యరశ్మిసోకే మైదానం, ఈ చెట్లు, ఈదారి, ఈ పక్షులు, ఈ పొదలు ఈ ఊగిసలాడే పూలగుత్తులు, దురదగొండి అడవి, అడవిబచ్చలి, తిప్పతీగలు—అంటే తనకెందుకింత ఇష్టమో వాడు యెవరికీ నచ్చచెప్పలేదు. ఇంట్లో ఉండబుద్ధి పుట్టదసలు వాడికి. 'నువ్వు చెట్ల వెంబడి, గట్ల వెంబడి ఊరికే తిరుగుతూ ఉండరా' అని వాళ్లనాన్న కనుక అనేట్లయితే భలే బావుంటుంది వాడికి. అలా అయితేనా ఈ విరగ పూసిన పొదల క్రింద నుంచి, అడవిలో దూరంగా ఎగిరే పక్షుల్ని చూస్తూ, ఇలాంటి నాటుదారిని ఎంతిదూరమైనా నడవగలడు. మధ్య మధ్య—వెదురు తోపుల్లో వెదురు కొమ్మల కిరకిరలు, సాయంకాలపు నీరెండలో మిసమిసలాడే రంగురంగుల పక్షుల కలకలలు వినిపిస్తూ ఉండాలి.

అపూ శైశవం ఈ ప్రకృతి సౌందర్యంతో పెనవేసుకుని గడిచిపోతోంది. ఒక ఋతువు వెళ్లిపోయి మరొక ఋతువు యెప్పుడొచ్చేదీ ఈ చెట్లలో, ఆకాశంలో, గాలిలో పక్షుల కూజితాల్లో వెల్లడవుతూనే ఉంటుంది. ఋతువు ఋతువుకీ ఇచ్ఛామతీనదిలో వచ్చే క్రొత్త మార్పులు గమనించగల గ్రాహ్యత వస్తోంది వాడికి. ఏ ఋతువులో, చెట్లలో, నదుల్లో, భూమిలో, ఆకాశంలో, పుష్పాల్లో, ఫలాల్లో ఎలాంటి పరివర్తన వచ్చేదీ వాడు బాగా తెలుసుకున్నాడు. వీటన్నిటితోటి సన్నిహితత్వం వాడికి చాలాయిష్టం. ఇవి ఏవీ లేని జీవితాన్ని వాడు ఊహించుకోలేడు. ఈ అపురూప దృశ్యాలను చూస్తూ పెరుగుతున్నాడు. గ్రీష్మంలో - పగల్లా ఎండ మాడ్చి మాడ్చి, ఉక్క పెట్టి, ఉక్కపెట్టి చివరకు దిక్చక్రమంతా కారుకమ్ముకుని వచ్చే మేఘాల గంభీర సౌందర్యం, సంజెవేళ సోనాడాంగా మైదానం మీది ఆకాశంలో రంగురంగుల మేఘాల క్రీడలు, భాద్రపదమాసం చివరలో రెల్లుపూలతో నిండి తెల్లగా కన్పించే మాధవపురం ఏటిలంకల ప్రదేశమూ, వెన్నెల రాత్రుల్లో చిన్న చిన్న గుడిసెల్లా కన్పించే వెదురు జొంపాలు—వీటన్నిటి అపురూప విశాల సౌందర్యం, అప్పుడప్పుడే వికసిస్తున్న, ఉత్సాహపూరితమైన అపూ అనావిల హృదయంలో హత్తుకుపోయింది. వాడిలో సౌందర్య తృష్ణను రేకెత్తించింది. వాడి చెవిలో రహస్యంగా అమృత దీక్షా మంత్రాన్ని ఉపదేశించింది. అపూ జీవితంలో ఎన్నడూ ఈ శిక్షణను మరిచిపోలేడు. శాశ్వత సౌందర్యోపాసన దీక్షను తనకు తెలియకుండానే విశాల ప్రకృతి మెల్లి మెల్లిగా వాడిచేత స్వీకరింప చేస్తోంది.

నతిడాంగా దగ్గిర ఎవరో చేపలు పట్టుకుంటున్నారు. అపూ కాసేపు అక్కడ చూస్తూ నుంచున్నాడు. ఊళ్లో ఓ గుడ్డి బిచ్చగాడు 'ఏకతార' వాయిస్తూ, పాడుతూ బిచ్చమెత్తుకుంటున్నాడు. అది అపూకొచ్చిన పాటే...సాతాని తాత బాగా పాడతాడు.

హరీష్‌పూర్ ఊళ్లోనుంచి వెడుతూంటే దారిప్రక్కన చిన్న పాకలో ఓ బడి ఉంది. పిల్లలు దీర్ఘాలుతీస్తూ, రాగధోరణిలో ఎక్కాలు చదువుతూంటే, కాసేపు అక్కడ వింటూ నుంచున్నాడు. పంతులు పెద్దవాడేం కాదు. తమ ఊళ్ళో ఉన్న ప్రసన్న పంతులుగారికంటె చాలా చిన్నవాడు.

మరొక సంగతి వాడికి మాటిమాటికీ గురుకు రాసాగింది తానిహ పెద్దవాడయినట్టే. చిన్నవాడు కాడిహ. చిన్నవాడయినట్లయితే అమ్మ ఒక్కడినీ ఇక్కడికి పంపించేదేనా?...ఇహనిప్పుడు ఊరికే ముందుకు పోవటమే చెయ్యవలసింది. అదీ కాక వచ్చే నెలలో సరిగా ఈ రోజున తాము ఎంతో దూరదేశానికెక్కడికో వెళ్ళిపోబోతున్నారు...

* * *

అపూ గంగానందపూర్ చేరుకునే సరికి ప్రొద్దు బాగా పడమరకు తిరిగిపోయింది. ఊళ్లో అడుగు పెట్టేసరికి వాడి కెక్కడిలేని సిగ్గూవచ్చి పట్టుకుంది, ఎవరికేసీ తలయెత్తి చూడలేకపోయాడు. శ్రమపడి ఎలాగో వారికేసిచూస్తూ మాత్రం నడవసాగాడు. అందరూ తనవైపే చూస్తున్నారనిపించసాగింది-తాను ఇవాళ వస్తున్నట్లు ఏమిటో ఇదివరకే అందరికీ తెలిసిపోయినటు-వాళ్ళిప్పటివరకు అడుగో ఆ అబ్బాయే, ఆవచ్చే అబ్బాయే చూడు, చూడు' అని అనుకుంటున్నట్లూ తోచింది. తన మూటలో కొబ్బరి చిప్పలు ఉన్న సంగతికూడా వాళ్లకందరికీ తెలుసునల్లే ఉంది. తన మేనత్త భర్త కుంజ చక్రవర్తిగారిల్లు ఎక్కడోకూడా ఎవరినీ అడగలేకపోయాడు.

చివరికి ఒంటరిగా కన్పించిన ముసిలావిడను అడిగితే, ఆవిడా యిల్లు చూపించింది. ఇంటికి వీధి వైపున మకురుగోడ ఉంది. ముందు వాకిట్లోకి వడితే ఎవరూ కన్పించలేదు. ఒకటి రెండుసార్లు దగ్గాడు. నోరు తెరచి మాట్లాడటం మాటలేనా యేం? తా

వలా ఎంతసేపు ఆ చైత్రమాసపు చుర్రుమనే ఎండలో నిలబడి ఉండాలో అంతుపట్టటం లేదు. కాని కాసేపటికల్లా పద్దెనిమిది పంధొమ్మిదేళ్ల వల్లని యువతి ఒకామె, ఏదో పని మీద బయటికివచ్చి, మెల్లాలో అడుగు పెట్టగానే - గుమ్మం దగిర చూడ చక్కని వాడు, ఇదివర కెన్నడూ ముఖ్యా మొహం ఎరగనివాడు అయిన ఎవరి అబ్బాయో, చిన్న మూట ఒకటి పట్టుకుని, సిగ్గుతో, బెరుకుతో నుంచుని ఉండటం చూసింది. ఆ యువతి విస్తుపోతూ, "నువ్వు ఎవరి అబ్బాయివి నాయనా? ఎక్కడినుంచి వచ్చావ్?" అని అడిగింది. అప్పూ అమాయకంగా ముందుకువచ్చి, అతికష్టంమీద- "మాది... మరీ...అదే ... విశ్వందిపురం. ......నా పేరు .. అప్పూ..." అన్నమాటలు ఎలా అయితే యేంపలకగలిగాడు. రాకుండా ఉంటేనే బాగుండేది అనిపించింది వాడికి. తానిలా తెలవని తలంపుగా వచ్చినందుకు అత్తయేం అనుకుంటుందో! లేని పోని పెడద ఏడెక్కడినుంచో వచ్చిపడ్డాడేమిటి అనుకుంటుందేమో!...అది అలా ఉండగా- ఇలా తెలియని చోటుకివచ్చి మాట్లాడటం ఇంత కష్టమని ఇదివరకెవరు ఎరుగుదురు? వాడికి ముచ్చెమటలు పోశాయి.

కాని ఆ యువతి వెంటనే గబగబా వచ్చి చెయ్యిపట్టుకుని ఎంతో ఆదరణ చూపుతూ తనని వసారాలోంచి లోపలకు తీసుకెళ్లింది. తన అమ్మ- నాన్నల క్షేమం అడిగింది తన గడ్డం పుణుకుతూ ఎంతో ఆదరణగా మాటాడింది. అక్కను ఎప్పుడూ చూడకపోయినా తలపుకు తెచ్చుకుని, కంట తడిపెట్టుకుంది. తన చొక్కా ఆవిడేవిప్పి, ముఖం కడిగి, పొడి తువ్వాలతో తుడిచి, చప్పునవెళ్లి ఓ గ్లాసెడు పంచదార షర్బత్ చేసి తీసుకు వచ్చి ఇచ్చింది. అత్త తానను కున్నట్లు లేదు చిన్నదే. రాజీవుడి అక్కకంటె కాస్త పెద్దది, అంతే.

అత్త తనకేసి, ఎగాదిగా చూస్తోంది. వేలువిడిచిన తన మేనల్లుడు ఇంత చిన్నవాడు, ఇంత ముద్దుటగా ఉంటాడు, అని అత్తకు ఇంతకుముందు తెలియదల్లే ఉంది. అంతలోనే ప్రక్కయింటి ఆవిడ ఎవరో వచ్చి, ఈ అబ్బాయి యెవరమ్మా అని అడిగే సరికి, ఆమె సగర్వంగా, "నా మేనల్లుడు. విశ్వందిపురం. మా పెదతండ్రిగారి మనుమడు. చాలా దగ్గరవాడే, అయినా యెప్పుడూ అట్టే రాకపోకలు లేవు" అని మళ్లీ సగర్వంగా అప్పూముఖంకేసి చూసింది.-చూడు నా మేనల్లుడు రాజకుమారుడిలా ఎంత చక్కగా ఉన్నాడో, నేనెలాంటి వంశంలోదాన్నో, మా కోవ ఎలాంటిదో ఇప్పటికైనా గ్రహించు- అని ఆ చూపులో భావం.

సందెపడ్డాక కుంజ చక్రవర్తి ఇంటికి వచ్చాడు. గండుమొహం అతడిది. చూస్తే ఏ శూద్రుడో అనుకోవలసిందే. ఏ వేన్నెళ్లుంటాయో ఎవరూ చెప్పలేరు. వాళ్ళ అత్తని. చూడగానే వాడికెంత సిగ్గేసిందో, మామయ్య మొహంచూడగానే వాడికంత భయంవేసింది. చిన్నప్పుడు తాను చదువుకున్న ప్రసన్నపంతులుగారి ముఖంలా ఉంది. 'నువ్వు చాలాగడిదేరిన వాడివిలా ఉన్నావే' అని ఇతడు ఇప్పుడే అనేస్తాడా అనిపించింది.

అప్పూ మర్నాడు ప్రొద్దున్నే లేచి. కాస్త ఈ వీధి ఆ వీధి తిరిగివచ్చాడు. చుట్టూఅడవి. గడ్డి ఎక్కడా మొలవటానికి సందు లేనంత అడవి. ఇక్కడొక యిల్లు, అడవిచుట్టూ ఉన్న దారి తిరిగివెళ్లగా, వెళ్లగా మళ్ళీ అక్కడొకఇల్లు. చాలా చోట్ల కొన్ని యిళ్లముంగిళ్లలో నుంచె దారి. తన ఈడుపిల్లలు నలుగురయిదుగురు ఆడుకోవటం చూశాడు. కాని, వాళ్ళందరూ తనకేసి, నోరు తెరుచుకుని చూడటం మొదలెట్టారు. వాళ్లతో సావాసం చేసుకుందామని ప్రయత్నించటం మాట అలా ఉంచి—అసలు వాళ్ళ ముఖాలకేసే చూడలేక పోయాడు.

అత్తయ్యగారింటికి తిరిగి రావటం ఎప్పుడా అన్నదికూడా చిక్కే. ఇంటిదగ్గరయితే ప్రొద్దున ఇలాంటప్పుడు తల్లినడిగి, ఏ మిఠాయో, మరమరాలో, లేకపోతే చద్ది అన్నమో అడిగి పెట్టించుకు తినేవాడు. మరి ఇక్కడ వీళ్ళు పెడతారా? రాత్రి అన్నం తినేప్పుడు పాలతో పాటు— సంకోచంకూడా కొనుక్కుని వచ్చి పెట్టారు. ఇవాళ ఇప్పుడే ఇంటికి వెడితే—'వీడికి తిండి రంధేనల్లే వుంది, ఏదయినా తిందామనే ఇంత పెందరాళే ఇంటికి తిరిగివచ్చా' డని అనుకుంటారేమో! ఇప్పుడేమి చెయ్యటం! వద్దు, ఇప్పుడింటికి వెళ్లొద్దు. ఇంకా కాసేపు అక్కడా ఇక్కడా తిరిగి, ఏకముగా భోజనాలవేళకి కాస్త ముందుగా వెడితే సరి! కొత్తఊళ్ళో ఇంతసేపూ వీధులలో అయితే మాత్రం ఎక్కడా మంచోటం?

అడుగులో అడుగులు వేసుకుంటూ చివరికి ఇంటికి తిరిగి వచ్చాడు.

#  పథేర్ పాంచాలి 

విడేనిమిదేళ్ల ఓ అమ్మాయి కంచుగిన్నె ఒకటి చేతో పుచ్చుకుని, వీధిగుమ్మం దాటి లోపలికి వచ్చి, 'వంట అయిందా పెద్దమ్మా! నాకొక్క పెడతావూ?' అని కేకేసి అడుగుతోంది. అపూ మేనత్త వంటింట్లోనుంచే "ఎవరు? గుల్కీ! కాలేదు, అయినా అంత వచ్చి పెట్టించుకు వెడదువు గానిలే" అన్నది. గుల్కీ గిన్నె కిందపెట్టి, వసారా ప్రక్కనుంచుంది. జుట్టు మగపిల్లల జుట్టులా కత్తిరించి వుంది. మాసిపోయిన గుడ్డలు కట్టుకుని ఉంది. తలకు నూనెలేదు. నలగా ఉన్నదా అమ్మాయి. అపూ వైపు చూసి, ఏం గ్రహించిందో ఫక్కున నవ్వి ఆ గిన్నె తీసుకుని వెళ్ళిపోయింది.

"ఎవరమ్మాయి అత్తా?" అని అడిగాడు అపూ.

"ఎవరు? గుల్కీయా? దానిదీ ఊరు కాదు. దానికి తల్లీ తండ్రీ ఎవరూ లేరు. నివారణ ముఖర్జీగారి పెళ్ళాం — ఇదే ఈ ప్రక్కయిల్లు — వేలు విడిచిన పెత్తల్లి అవుతుంది. వాళ్ళింట్లోనే ఉంటూ వుంటుంది" అన్నదామె.

మర్నాడు ఆ వీధిలోని కుర్రాడొకడు వచ్చి, అతనితో సావాసం చేసుకొని, వెంటబెట్టుకుని ఊరంతా చూపిస్తూ త్రిప్పాడు. ఇంటికి వస్తూంటే దారిలో ఆ చెక్క లేని కిల గుల్కీ ఒక్కతే కాళ్ళు చాచుకు కూర్చుని ఏవేవో తింటోంది. అపూని చూడగానే ఆదరా బాదరా ఒడి మూసుకోబోయింది. ఒడినిండా దోరగా ఉన్న పొగడపళ్ళున్నాయి. అపూ వాళ్ళ దగ్గర ఈ లోపుగా ఆ అమ్మాయిని గురించి ఇంకా కొన్ని సంగతులు తెలుసుకున్నాడు. నివారణ ముఖర్జీ భార్య ఆ అమ్మాయిని సరిగా చూడదు. మనిషి మంచిది కాదు. 'పెత్తల్లి కాదా విడ. పోలేరమ్మ. ఒక్కొక్క రోజు తిండే పెట్టదు. వాళ్ళింట్లో వీళ్ళింట్లో అడిగి పెట్టించుకుని తింటూ ఉంటుంది. వాళ్ళది అసలు గంపంత సంసారం. వాళ్ళకే గడవక గిజాటుగా వుంటే ఇంకా దీనికి కూడా...' అని చెప్పింది అత్త. గుల్కీని చూస్తే ఆ పిల్లని సావాసం చేసుకోవాలనిపించింది వాడికి. చిన్నపిల్ల. పాపం ఎవరూ లేరు. దగ్గరకువెళ్ళి "ఒళ్ళో ఏమిటి దాచుకున్నావే అమ్మాయ్," అన్నాడు. గుల్కీ కొంచెం సేపు ఇకిలించి నవ్వి, చటుక్కున ఒడిముడుచుకుని పరుగెత్తింది. దాని వెనకే చూసేసరికి అపూకి నవ్వు వచ్చింది. పరుగెత్తుతూంటే గుల్కీ ఒళ్ళో నుంచి క్రింద పడిపోతున్నాయి. అపూ వాటిని ఏరుతూ 'పడిపోతున్నాయి, అన్నీ పడిపోతున్నాయి, నీ పొగడపళ్ళు తీసుకుపో అమ్మాయ్! నేనేమీ అననులే, తీసుకుపో అని కేకవేశాడు...గుల్కీ అప్పటికే మాయమైంది.

అపూ తాను చెరువుకివెళ్ళి స్నానంచేసి కూర్చుని ఉండగా గుల్కీ దొడ్డి గుమ్మంలోంచి తొంగిచూస్తూ మళ్లీ ముఖం చాటు చేసుకుంటూ ఉండటం గమనించాడు. అపూ తనని చూడగానే మళ్ళీ ఇకిలిస్తూ నవ్వింది. అపూ లేచినుంచుని, "ఉండు ఒక్క పరుగులో పట్టుకుంటాను నిన్ను" అంటూ గుమ్మం దగిరకు పరుగెత్తాడు. గుల్కీ వెనక్కి తిరిగి చూడకుండా తిన్నగా చెరువుగట్టు వైపుకి పరుగెత్తింది. కాని అపూతో ఎక్కడ పరుగెత్తగలదు? ఏం చెయ్యటానికీ తోచక అక్కడ ఆగిపోగానే అపూ ఆ అమ్మాయి జుట్టు అందిపట్టుకుని, "భలే పరుగెత్తుతావే! నాతో పరుగెత్తుదామనే నువ్వు?" అన్నాడు. గుల్కీకి మొదట్లో భయంవేసింది, కొడతాడేమో అని...కాని అపూ జుట్టు వదిలిపెట్టి ఇదొక ఆటలే అన్నట్టు నవ్వేశాడు. ఆ అమ్మాయి మళ్లీ అలాగే నవ్వింది.

అపూకి చాలా జాలేసింది. ఆ అమ్మాయి నవ్వులో అతనితో సావాసం చెయ్యాలని, ఆడుకోవాలని ఉన్నదన్న భావం తోచింది అపూ మనస్సుకి. కాని చిన్నపిల్ల. ఆసంగతి ఎలా చెప్పాలో తెలియక, తొంగి తొంగి చూస్తూ, ఇకిలించి నవ్వుతూ, పారిపోతూ ఉద్దేశాన్ని వ్యక్తం చేస్తోంది. మరో పద్ధతి తెలియదా అమ్మాయికి. ఈ అమ్మాయి అచ్చుగా తన అక్కలాగానే ఉంది. ఈయీడులో అక్కకూడా ఇలాగేఉండేది. ఇలాగే ఒడినిండా కామంచిపళ్లో, రేగిపళ్లో పోసుకుని తన యిష్టంవచ్చినట్టు తిరుగుతూ ఉండేది. ఎవరికీ తెలిసేదికాదు, ఎవరికీ కన్పించేది కాదు. అంత అలిండా. ఇలాగే అమాయకంగా ఉండేదిచిన్నపిల్ల అప్పుడు.'

'ఈ అమ్మాయితో ఎవరూ ఆడుకోరు. కానివ్వు ఆడుకుంటే బావుండును నేను; పాపం అమ్మా నాన్నాలేని అమ్మాయి. తన యిష్టం వచ్చినట్టు తిరుగుతుంది' అనుకున్నాడు అపూ.

జుట్టువదలి చెయ్యిపట్టుకుని "ఆడుకుందామా అమ్మాయ్? పద చెరువు గట్టుకి పోదాంపద. అదికాదు. నువ్వుముందు పరుగెత్తు నేను పట్టుకుంటాను. ఈ పనసచెట్టు ఎల్ల. రా" అన్నాడు.

చెయ్యి వదలిపెట్టగానే గుల్కీ ఇంక అక్కడనుంచోకుండా మళ్ళీ పరుగుతీసింది. "పరిలే వెళ్లు. అయినా ఎంతదూరం వెళతావో చూస్తాను. నిన్ను పట్టుకోలేకపోతే అప్పుడు చెప్పు..." అంటూ దమ్ము బిగబట్టి పరుగుతీశాడు. గుల్కీ వెనక్కి తిరిగి అపూ పరుగెత్తుకు రావటంచూసి, తన బలం కొద్దీ పరుగెత్తటానికి ప్రయత్నించింది. కాని అపూ కొంత దూరం పరుగెత్తే సరికల్లా ఆ అమ్మాయి చిక్కింది. "బాగా పరుగెత్తటం నేర్చుకున్నావే. అయితేయేం నాతో నువ్వు పరుగెత్తగలవా? పద, 'దొంగ-కాపలావాడి ఆట' ఆడుకుందాం. నువ్వు దొంగవనుకో. ఈ పనస చెట్టుకాయ కోసుకుని పరుగెత్తుతున్నావని అనుకో. తెలిసిందా. నేను కాపలాదారునయి పట్టుకుంటాను. నిన్ను" అన్నాడు.

గుల్కీ నవ్వటం మానేసింది. ఈచక్కటి అబ్బాయితో సావాసం అయితే బావుండునని లోపల అనుకుంటున్నదేమో "చింతగింజలు తీసుకురానా?" అని తల ఆడిస్తూ పెద్ద ఇదిగా అడిగింది అపూని. శూద్రుల వాడలో పెరగటంవలన ఇలా మాట్లాడటం అలవాటయి ఉంటుంది. తమ ఊళ్ళో గొల్ల పిల్లలు ఇలాగే మాట్లాడతారు — అనుకున్నాడు.

మధ్యాహ్నం వాళ్ళ అత్త పిలిస్తే గుల్కీ వెనకవైపునుంచి వచ్చింది. అపూ తినటం అయినాక వాళ్ళఅత్త..."అన్నం తింటావా గుల్కీ? అపూ తిన్న విస్తట్లో కూచో. చేపలపులుసుంది, పప్పువేస్తాను." అన్నది. గుల్కీతో. 'అయ్యో, పాపం అది తింటుందని తెలిస్తే రెండుచేప ముక్కలయినా వదిలిపెట్టేవాడినే' అనుకున్నాడు అపూ. గుల్కీ మరుచెప్పకుండా, సిగ్గులేకుండా అపూ విస్తరిముందు కూర్చుంది ఎక్కువ అన్నం అడిగి పెట్టించుకుని. పప్పువేసి పిసికి చివరికి అంత అన్నం తినలేక విస్తరి క్రిందకు తోసింది. అయినా అక్కడినుంచి లేచి వచ్చేట్లులేదు అపూ అత్త నవ్వుతూ, "ఇంక తినొద్దు, లేచిరా, గుల్కీ! అటూ ఇటూ కెలికి పారేస్తున్నావ్. ఛే. ఎంత అన్నం కలిపి పారేశావో చూడు. నీదంతా నిజమైన ఆకలికాదే" అని, "ఆ పెత్తల్లి చూడు. అజ్ఞానపు పిల్లని, అన్నానికి రమ్మని పిలవద్దూ? పరాయిపిల్ల అయితే యేం, పసిపిల్ల కదా!" అన్నది.

శనివారంనాడు సిద్ధేశ్వరి ఆలయానికి అపూ పూజచేయించటానికి వెళ్ళాడు. పూజారి బ్రాహ్మడికి పెద్ద పొడుగాటి తెల్లటిగడ్డం వుంది. మంచి వర్చస్సుకల ముఖం ఆయనది. ఆయన కూతురు వితంతువు. ఆమెకూడా తండ్రితో వచ్చి, పూజకు కావలసినవన్నీ అమరుస్తూ అన్నగుడికి చేదోడుగా ఉంది. "అణా దక్షిణ ఏమిటబ్బాయీ? అణా [illegible] లేదు, మా నాన్న [illegible]"

## విమర్శ

ఒక నాటక రచయిత, తన నాటకం రిహార్సల్స్‌కు ఒక విమర్శకుడిని ఆహ్వానించాడు

ఆ విమర్శకుడు నాటకం కొంతసేపు చూసి, మెల్లిగా కళ్లు మూసుకుని గుర్రు పెట్టి నిద్రపోయాడు.

ప్రదర్శన ముగిసిన తరవాత గాని రచయిత ఇది గమనించ లేదు.

"చూసి మీ అభిప్రాయం చెప్పమంటే ఇలా నిద్రపోవడం భావ్యమేనా" అని నిలదీసి అడిగేశాడు.

"ఏం ఇది మాత్రం అభిప్రాయం కాదా?" అన్నాడు విమర్శకుడు లేచి ఒళ్లు విరుచుకుంటూ.

అన్నదా అమ్మాయి. "మాఅమ్మ అణాయే ఇచ్చింది మొత్తం. అంతకంటె నాదగ్గర ఇంకేమీ లేదు." అన్నాడు అప్పూ. ఆఅమ్మాయి కొసినిఅరటిపళ్లుఒలిచి ఆకులో పెట్టి వాడిచేతికిస్తూ "ఇందులో ప్రసాదం ఉంది. మారేడుపత్రి, కుంకుమ కూడా ఇచ్చాను. తీసుకెళ్ళి మీఇంట్లో ఆడవాళ్ళకియ్యి" అన్నది. వీళ్లు చాలా మంచివాళ్లు పాపం, నాదగ్గిర ఉన్నట్టయితే ఇంకో అర్థణాఅయినా ఇచ్చేవాణ్ణి' అనుకున్నాడు అప్పూ.

అత్తయ్యగారింటికి వచ్చి, ఆరుబయట వెన్నెల్లో కూచుని అప్పూ అత్తతో పూజ కబుర్లు చెపుతున్నాడు. ప్రక్కన గుల్‌కీ వాళ్ళ యింట్లోంచి, గుల్‌కీ మిన్నుముట్టేట్టు కేకలువెయ్యటం విన్పిస్తోంది. "అమ్మో! కొట్టబోకు పెద్దమ్మ! బాబోయ్ నా వీపు బ్రద్దలై నెత్తురువస్తోంది. కొట్టొద్దు పెద్దమ్మ" ...ఆకేకలతో పాటు మరొక కర్కశకంఠం అరవటంకూడా విన్పించింది: "దౌర్భాగ్యురాలా! దరిద్రమొహమా! చౌధురీగారింటికి బొట్టు కొటుక పెట్టి భోజనానికి పిలిచారని వెళ్ళి తినివచ్చావా? అంత నాపిరితనమే? నాలికమీద గరిటకాల్చి వాతపెడతానుండు ఇవాళ. ఇంటింటికీపోయి అడిగి పెట్టించుకుని తింటావ్ — అపెట్టే వాపసానులకైనా కళ్లు పోయినాయారేం! నేనేం పెట్టనంటున్నానా! ఎక్కడో లేనిపోని తద్దినానికి పోగయినావ్. ఇంట్లో నీకేంపెట్టటంలేదా? నిన్న ఇవాళ—"

"చూశావా? ఊరంతా వినపడేట్లు ఎత్తిపొడుపుగా ఎన్నెన్నిమాటలంటున్నదో! ఉన్నమాటంటే ఉన్నఊరు అచ్చిరాదంటారు—" అన్నది అత్త అప్పూ మనస్సంతా గజిబిజిగాఉంది. కళ్లు చెమ్మగిలి, కంఠం పట్టుకుపోవటం మూలంగా పైకి యేమీ మాట్లాడలేకపోయాడు.

మర్నాడు సాయంత్రం కాస్త ప్రొద్దుండగానే అన్నంతిని అప్పూ గొల్లవీధి కేసి వెళ్ళాడు. ఈ ఊరునుంచి నవాబ్‌గంజ్ షాగాకుబళ్లు వెడుతున్నాయట. సాయంత్రం ఆబళ్లలో దేనిలోనయినా ఎక్కికూచుంటే ప్రొద్దుపొడిచేవేళకి వాళునిళ్ళం దిపురంలో దిగబెడతారని మామయ్య క్రితం రోజునే చెప్పి, ఆయేర్పాటు చేయించాడు.

కొస్తదూరంవెళ్లి బ్రాహ్మణవీధి మలుపు తిరుగుతూండగా గుల్‌కీ ఎదురయింది. ఆ అమ్మాయి ఆడుకుని, సంజెపడేలోపున ఇంటికి వెళ్ళేందుకు బయలుదేరింది. "ఇంటికి వెడుతున్నాను ఇవాళ...రోజంతా ఎక్కడున్నావ్? ఆడుకోటానికికూడా రాలేదే!" అన్నాడు అప్పూ. గుల్‌కీ తనమాట నమ్మనట్లుగా నవ్వటంచూసి, "నిజం. నిజమే చెపుతున్నా, ఇదిగో ఇంకా చూడరాదూ మాట? గొల్లకార్తిక్ వాళింటికివెళ్ళి బండి ఎక్కుతాను. నాతో కొస్తదూరం రా, పంపించివద్దువుగాని" అన్నాడు.

గుల్‌కీ అప్పూ వెనకాలే కొంతదూరం వరకు వెళ్లింది. బ్రాహ్మణవీధి చివర కొంతదూరం ఇళ్ళేమీ ఉండవు. ఆ ఖాళీ స్థలందాటాక గొల్లవీధి. గుల్‌కీ ఆఖాళీస్థలం వరకూ వచ్చింది. అప్పూతొడుక్కున్న ఎర్ర చొక్కాని వ్రేలితో చూపిస్తూ "ఈ చొక్కాయెంత?" అని అడిగింది.

అప్పూ నవ్వుమొహంపెట్టి, రెండురూపాయలు. నీకు కావాలా?" అని అడిగాడు. గుల్‌కీ ఇకిలిస్తూ నవ్వింది. అంటే నువ్వు ఇవ్వాలేకాని ఇప్పుడే...'

చటుక్కున ఎదుటికి చూచేసరికి మైదానం చివర చెట్ల మధ్యనుంచి మాత్రం సంజె వెలుగు కన్పించింది. వచ్చేనెలలో సరిగా ఇదే రోజున తాము ఎక్కడికో, ఎంతో దూరం వెళ్లి పోతాంకదా అన్న సంగతి ఊరికే నే తలుపుకువచ్చింది. తర్వాత గుల్‌కీతో "ఇంక రావొద్దు, వెనక్కి వెళ్లిపో గుల్‌కీ, చాలా దూరం వచ్చేశావ్. మీ ఇంట్లో మళ్ళీ తిడతారేమో! వెళ్లు కళ్లు. ఈసారివచ్చినప్పుడు కన్పిస్తానులే, ఏం? బహుశా ఇంక రానేమోలే. మేము వైశాఖమాసంలో కాశీ వెళ్ళిపోతాం. అక్కడే ఉండిపోతాం" అన్నాడు.

గుల్‌కీ ఇంకోసారి మళ్ళీఅలాగేనవ్వింది.

ఆ రోజున చతుర్దశో, పౌర్ణమో ఏదో అలాంటి తిథి. వాడి చివరికెప్పుడూ ఇక్కడికి రాలేదు. కాని చిన్ననాటి తన ఈ మొదటిప్రయాణపు చిత్తరువు వాడికి చాలా కాలం వరకు గుర్తుంది. ఎదుట నూటిగా మైదానం చివర దూరంగా చెట్ల సందుల నుంచి పూర్ణచంద్రుడు పైకి వస్తున్నాడు. చతుర్దశి చంద్రుడే నేమో! వాడికి జ్ఞాపకం లేదు. వెనకాలే ఆ వెర్రిబాగులపిల్ల, దిక్కులేనిపిల్ల, చింకిరి జుట్టు చిన్నపిల్ల తనని పంపించటానికి వచ్చింది...

(ఇంకా ఉంది)

# గజదొంగ

## జయంతి శ్రీరామమూర్తి

కొత్తగా రైలులో అడుగుపెట్టినప్పటి నుంచీ నా మనస్సు మనస్సులా లేదు. నాలుగురోజుల క్రితమే రిజర్వు చేయించుకున్నా, పై బెర్తే నాకిచ్చిన రైల్వేవాళ్ల మీద పట్టరాని కోపం కలిగింది. వాదించి క్రింది బెర్తు సంపాదించుకోవాలనుకున్నాను గాని, భార్యా పిల్లలతో వచ్చిన తోటి ప్రయాణీకుని పైకి ఎక్కించడం బాగుండదని మానేసేను. ఇంతలో ఆయనా, ఆవిడా కలిసి రెండు బెర్తులమీదా పరుపులూ అవీ పరచివేశారు. పిల్లవాళ్లు ముగ్గురూ అదే పనిగా అల్లరి చేస్తున్నారు. ఆమె వాళ్లని వదిలేసి తలలో పూలచెండు ముడుచుకునే ముస్తాబులో మునిగివుంది. ఎడమచేతిలో అద్దం పట్టుకుని, కుడిచేత్తో వయ్యారంగా పిన్ సర్దుకుంటూ, ముఖం అటూ యిటూ త్రిప్పుకుని తన అందానికి తానే ముగ్ధురాలవుతోందా అనిపిస్తోంది. ఆయన న్యూసు పేపరులో తలదూర్చి ప్రపంచాన్నే మరచిపోయినట్టు కనిపిస్తున్నాడు. ఇక, నేనెక్కడ చూస్తున్నానో వేరే చెప్పాలా? ఆమె కేవలం అందగత్తె అని చెప్పడం ఆమెకు తీరని అపచారం చెయ్యడమవుతుంది. దేవలోకంలో మనుషులుంటారో, వుండరో తెలియదుగాని, మానవలోకంలో దేవతలుంటారని తెలుసుకున్నాను. ఆమె కళ్ళకి పెట్టుకున్న కాజల్ గాని, మెరువుగా చుట్టుకున్న సిగ తీరుగాని, ముచ్చటగా కత్తిరించుకున్న జంపరు మెడగాని — ఏం చూసినా ఆవిడ సౌందర్యోపాసకురాలు అని చెప్పి తీరతాయి.

ఉన్నట్టుండి రైలు కదిలింది. పిల్లవాళ్లు కిటికీలోంచి బయటకు తొంగిచూస్తూ తల్లి నేదో అడుగుతున్నారు. ఆవిడ వాళ్లని నవ్విస్తూ తాను నవ్వుతోంది. అలా నవ్వినప్పుడు ఆమె పలువరస సూర్యకాంతిలోని అద్దంలా తళతళా మెరుస్తోంది. రైలు స్పీడు అందుకుంది. ఇంక మౌనం పట్టలేక "భాయీసాబ్! ఎంతవరకూ మీ ప్రయాణం?" అన్నాను. ఆయన ఒకసారి పైకి చూచి, "శ్రీనగర్" అన్నాడు ముభావంగా. మళ్ళీ ఏమీ ఎరగనట్లు పేపరు ప్రపంచంలో మునిగిపోయాడు.

కాస్సేపటికి వాళ్లంతా భోజనానికి తయారయ్యేరు. తెచ్చుకున్న క్యారియరు తీసి ఆయన నన్నూ దిగి రమ్మన్నాడు. నేను ముందు బెట్టుసరి చేసినా కడకు దిగి రాక తప్పలేదు. నేను సిగ్గుపడుతున్న కొలదీ ఆయన నాతో మాట్లాడం మొదలు పెట్టేడు. భోజనానంతరం చాలాసేపు అనిల్ బాబు ప్రక్కనే కూర్చున్నాను. ఆ రాత్రి పన్నెండింటి వరకూ ఆయనతో బాతాఖానీకొట్టే మహాద్భాగ్యం నాకు కలిగింది. ఆయన ఢిల్లీలో పెద్ద వర్తకుడు. వ్యాపారమూ, అందులోని లోతుపాతులు, ప్రభుత్వ విధానాలకూ, వర్తకపు రీతులకూ గల సంబంధమూ ఆయన నాకు చక్కగా తెలియజెప్పేడు.

అది విన్నాక వర్తకమూ ఒక మహాశాస్త్రమే అనిపించింది నాకు. పిమ్మట పంచవర్ష ప్రణాళికలూ, లోక్ సభలోని చర్చలూ అవీ గురించి ప్రసంగించుకున్నాం. ఆయనకి అనేక విషయాలు తెలుసు. ఏ విషయమైనా తుణ్ణంగా విపులీకరించ గల వాఖ్యాత. రూపానికి రూపం, ధనానికి ధనం పుష్కలంగా వున్నాయేమో ఆయన జీవితం నందనవనం గాక ఏమవుతుంది? వాటన్నిటినీ మించిన మహత్తర సంపద ఇంకొకటి ఆయన సొమ్ము. నా ఇరవయ్యేళ్ల జీవితంలో—ఇన్ని దేశాలు తిరిగినా, నే నంతటి రూపవతిని చూడలేదంటే అతిశయోక్తి కాదు. అనిల్ బాబు అప్పుడు నా మాట అడిగేరు. నేనూ శ్రీనగర్ వస్తున్నానంటే ఆనందించేరు. "రిటర్న్ టిక్కెట్టు కొన్నావు గాని లేకుంటే పఠాన్ కోట నుంచి మాతో విమానంలో వద్దువు గదా" అన్నారు. "పోనీలెండి, శ్రీనగర్ లోనే కలుసుకుందాం" అని దాటేశాను. నే నా రాత్రి పై బెర్తుమీద పడివున్నా నన్న మాటేగాని, నిద్రిస్తూన్న ఆవిడముఖంలోని కళాకాంతులకు ముగ్ధుడనై దొంగచాటున తొంగిచూస్తూనే గడిపేను.

మరునాడు పఠాన్ కోటలో ఎవరిదారి వారిదయింది. అనిల్ బాబు విడిపోతూ ఢిల్లీలోని తన అడ్రస్ కార్డు నాకిచ్చేరు. ఆవిడ ఆ క్షణాన పెట్టిన 'నమస్తే' ఈనాటికీ మరపు రాదు. ఇంతకీ ఆశ్చర్యకరమైన విషయమేమంటే మళ్లీ నేనూ అనిల్ బాబు సంసారం శ్రీనగర్ లో హౌస్ బోటులో తటస్థపడ్డాం. అలా జరగడం ఋణానుబంధమనే చెప్పాలి. లేకుంటే శ్రీనగర్ లో ఎన్ని బోట్లు లేవు? పోర్టరు నన్ను అక్కడికే తీసుకు వెళ్లాలా? ఆ బోటు పేరు 'నసీబ్'. దాని యజమాని అయ్యూబ్ ఖాన్ కనుబొమ్మలు నెరసిన వృద్ధుడు. జీవితంలోని ఒడుదుడుకుల కన్నో బోల్తాలు కొట్టివేచిన వాడని అతని నుదుటిమీది ముడతలే చాటుతున్నాయి. అతడు నన్నాహ్వానించి గది చూపించేడు. ఆ బోటులో మొత్తం ఆరు గదులున్నాయి. అయిదింటిని అనిల్ బాబు సంసారం తీసుకున్నారు. అనిల్ బాబు నా గొంతు వినబడగానే బయటకు వచ్చి "భాయీసాబ్" అని చేయి కలిపి, "కల్యాణీ" అని కేక పెట్టేరు. ఆవిడ కూడా వచ్చి "నమస్తే" అన్నది. ఇంతలో పిల్లలు ముగ్గురూ వచ్చి "అంకుల్, అంకుల్" అని నన్ను చుట్టేసేరు. వాళ్లని పనిమనిషి విదలించి తీసుకుపోయింది. రెండో ఆలోచన లేకుండా నేనాగదిలో వుండిపోయాను.

మరునాటి నుంచీ నేను శ్రీనగర్ పరిసరాలన్నీ తిరగడం మొదలుపెట్టేను. దాల్ లేక్, మానసబాల్ లేక్, శంకరాచార్య కొండ, జీలంనది, చష్మాషాహి, నిషాద్ బాగ్, షాలిమార్ బాగ్ చూసినవే చూడడం కాళ్ళరిగేలా తిరగడం. ఎంత వెదకినా నేనూహించుకున్న అందమంతా నాకు హౌస్ బోట్ 'నసీబ్' లోనే వుందా అనిపించింది. దివారాత్రాలు అనిల్ బాబు దంపతుల సాన్నిహిత్యంలో గడపాలని వుండి కాని, వాళ్లిద్దరూ ఎప్పుడో కాని బోటులో వుండరు. ఉదయమే 'ఆయా' పిల్లల్ని బయటికి తీసుకుపోతుంది. అటుపిమ్మట భార్యాభర్తలు తమదారిని తాము పోతారు. ఒక్కొక్కప్పుడు జీలంనది గట్టున గుర్రాలమీద స్వారీ చేస్తుంటారు. ఇంకోసారి ఇద్దరూ గేలాలు పట్టుకు చేపలు పడుతుంటారు. మరోమాటు షికారులో పడుకుని రంభా నలకూబరుల్లాగ విహరిస్తుంటారు. నేను ప్రక్కవాటున తిరుచు వీళ్ళని పరికిస్తూనే వుంటాను. ఏ వేషం వేసుకొన్నా ఆవిడ చూడ ముచ్చట

గానే వుంటుంది. ఏ బట్ట అయినా సరే ఆవిడ వొంటిమీద రాణిస్తుంది.

ఒకరోజు సాయంత్రం నేను నాలుగింటికే ఇంటికి వచ్చేసేను. ఆవిడ బోటు టాపు మీద కుర్చీలో కూర్చుని పొడుగాటి గేలం నీటిమీద వూపుతూ వినోదిస్తోంది. నన్ను చూసి చిరునవ్వుతో "ఈ వేళ పెందలాడే వచ్చేసేరే" అన్నది.

"అవును. అనిల్ బాబు లేరా" అన్నాను.

"లేరు. వొంట్లో బాగాలేక డాక్టరువద్దకు వెళ్ళేరు" అన్నది. ఇంతలో ఆవిడ గేలానికో చేప తగులుకుంది. ఆవిడ దాన్ని పైకి తీసి, విలవిలలాడుతూంటే నవ్వుతూ, దానికి ఊపిరాడక చావ సిద్ధమైనప్పుడు నీటిలోకి విసిరేసింది. ఆవిడ ఇలా రెండుసార్లు చేసేక, ఊపహింప సహించలేక అన్నాను—

"కల్యాణీదేవీ! ఇదేం న్యాయం, దాన్ని చావనివ్వరు, బ్రతకనివ్వరు?—

ఆమె పకపకలాడుతూ, "అదే నాకు సరదా. నిజానికి నాకు దీన్ని తినాలనికాదు గేలం వేస్తే, మేం మత్స్య మాంసాలు తినం కూడాను. దీన్ని చావు పర్యంతమూ తీసుకు వచ్చి, జీవనప్రదానం చెయ్యకపోతే నన్ను, పాపం, ఈ జీవికి నేను చెయ్యగల మేలేమిటి? ఆఖరికి మన బ్రతుకూ యింతేగదా దేవుని చేతిలో?"—అంది. నిజానికి ఆవిడ కళ్లు నా కుండేని గేలం వేసి లాగుతున్నా అనిపించింది.

మరునాటి ఉదయం అనిల్ బాబు నన్ను పిలిచి "ఒక చిన్నపని చెయ్యాలి. అభ్యంతరం లేదుగదా" అన్నారు. ఆశ్చర్యపడుతూ, "తప్పకుండా చేస్తాను" అన్నాను. ఆయన సాదరంగా యిలా అన్నారు. "ఈ వేళ నా వొంట్లో బాగాలేదు. డాక్టరు బయటకు కదలవద్దన్నారు. మీరు కొంచెం సేపల్లాగ దీదీతో (సోదరి) షికారుకు వెళ్ళి రావాలి"—నా మూలాన ఆమె దినచర్యకి భంగం కలగడం నా కిష్టం లేదు"—

"సరే, అల్లాగే వెడతాను" అని వొప్పుకున్నాను.

కల్యాణీదేవి ఆ ఉదయం నాచురంగుచీర కట్టుకుంది. అదేరంగు సిల్కు జాకెటు. దాని చేతులనిండా ఎంబ్రాయిడరీతో అందంగా కనబడుతోంది. కళ్లనిండా కాజల్ గోళ్ళకి రంగు, చేతులకు ఆగుజాతుల బంగారపు గాజులు. నిజంగా ఆమె అలంకరణ చూచి చాలా ఆశ్చర్యపడ్డాను. పరాయివానితో షికారుకు బయలుదేరడం, ఇంతటి వేషధారణ నాలో సందేహాంకురాలను నాటుతున్నాయి. మేము మెల్లిగా డాల్ సరస్సీరాన నడుస్తున్నాం. ఆమె మధ్య మధ్యన ఆగి ఆ నీళ్ళలోకి తొంగి చూస్తోంది. నీటిలో ప్రతిబింబిస్తూన్న కొండశిఖరాలు ఆమెను ఆకర్షించివుంటాయి. ఒకప్రక్కన ఉన్నతమైన పర్వతాగ్రాలు, ఇంకొకప్రక్క అగాధమైన సరోవరం. నా మనస్సు ఎటువెడుతోందో నాకే తెలియకుండా ఉన్నట్లుండి కల్యాణీదేవి ఆ చెరువుగట్టున కూలబడింది. ఆ ఖరీదైన దుస్తులకు లెక్క చెయ్యకుండా, ఆ గడ్డిలో, మట్టిలో అలాగే చతికిలబడింది. చీరని మోకాళ్ళదాకా ఎగదీసుకుని, కాళ్లు నీళ్ళల్లోకి వ్రేలాడేసింది. ఇదంతా గమనిస్తూన్న నా ఆశ్చర్యాన్ని గుర్తించి, "ఇదే నాకు సరదా. ఈ నాచు వాసనంటే నాకెంతో యిష్టం." అంటూ కాళ్లు ఆడించడం మొదలుపెట్టింది. నీటిలో లేచిన అలలకు తామరాకులు పడగలు విప్పిన పాముల్లాగ ఆడుతున్నాయి. గట్టున వున్న కప్పపిల్లలు భయపడి నీటిలోకి గెంతుతున్నాయి. సమీపంలో ఆడుకుంటూన్న బాతుల గుంపు 'క్వేక్, క్వేక్' అని అరుస్తూ దూరంగా ఎగిరిపోయింది. కల్యాణీదేవి కుడి కాలి బొటన వ్రేలితో ఒక పద్మాన్ని పైకెత్తి "చూడండి - దీనికెంత గర్వమో" అంది. ఆమె పాదం నీటిలో నాని పద్మపత్రాల కన్న తెల్లగా, అందంగా కనిపించింది నాకు.

"ఏది పద్మమో, ఏది పాదమో తెలియడం లేదు," అన్నాను. ఆమె దిఙ్కున నాకేసి తిరిగి, "మీరు కవులు కూడానా?" అంది అక్కడనుంచి తిన్నగా మేం నిషాద్ బాగ్ కు వెళ్లేం. అక్కడ కల్యాణీదేవి చాలా సీరియస్ గా ఏదో పారేసుకున్నట్లు కనిపించింది. పువ్వులతోట



కాశ్మీర సరోవరాల్లో నౌకా గృహాలు.



# గజదొంగ



చేతులు వేస్తూ పై అంతస్తుదాకా నడిచింది. అక్కడనుంచి నీటి జల్లులవైపు తిరిగి డాల్ సరస్సుని పరికిస్తోంది. జల్లుల కిటూ అటూ వున్న రంగులపూలు ఆమెను వశపరచు కున్నాయి. దీర్ఘంగా ఊపిరి పీలుస్తూ ఆమె యిలా అన్నది: "నిషాద్ అంటే సుఖానుభవం - అనుభవించడమనేది అందరికీ చేత కాదు"—

"ఇది మొగల్ చక్రవర్తుల సొమ్ము" అన్నాను.

"పొరబడుతున్నారు. మొగల్ రాణుల సొత్తనండి. నూర్జహాన్ అంతటి త్రిలోకసుందరి కాకపోతే జహాంగీర్ ఇందులో విహరించే వాడా?" అంటూ ఆమె ఆవేశంతో చెప్పింది. అప్పటికి మధ్యాహ్నమయింది. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేడు. కల్యాణీ దేవికి టైం చూపించేను. ఆవిడ తొందరగా 'వెళదాం, వెడదాం' అంటూ బయలుదేరింది. గుమ్మంవద్ద కాపలావాడొక ఎర్రటి గులాబీ తెచ్చియిచ్చేడు. ఆవిడతలలో పెట్టుకో బోతూండగా ఆ పువ్వు రెండుసార్లు జారి చీరకొంగులో చిక్కుకుంది. మూడోసారి "సహాయం చేస్తారా" అన్నట్లు నాకేసి చూసింది. నేను తీసుకుని ఆ కుసుమాన్ని ఆమె సిగలో ముడిచేను.

ఆ మధ్యాహ్నం భోజనంచేసి నా గదిలో ఒంటరిగా పడుకున్నాను. నిద్ర పట్టలేదు గాని, పగటికలలు కంటున్నాను. కల్యాణీదేవి నాలో ఖాండవదహనం కలిగిస్తోంది. ఆమె చూపులు అంత వాడిగా ఎందుకుంటాయి? అవిగాని మన్మథుని వాడితూపులు కావుగదా! ఎంతమాట? అంత అందమైన, ధనికుడైన భర్త వుండగా......ఆమె వయసేమి, నా వయసేమి? నాది యౌవనావిర్భావం—ఆమెది పూర్ణ యౌవనం. ఆమెకు ముగ్గురు పిల్లలు. అయినా ఆమెసిగలో నన్ను పువ్వు పెట్టమన్న సమయం నా మెదడులో స్థలం లేకుండా ఆక్రమించింది.

నాలుగింటికే కల్యాణీదేవి తలుపు తట్టి "తయార్?" అంది. "తయార్" అని లేచేను తడబడుతూన్న కాళ్లతో. ఆమె ఆ సాయంత్రం నేను వర్ణించలేనంత అందంగా తయారయింది. ఎర్రటి జార్జెట్ చీర, ఎర్రటి బ్లౌజు, ఎర్రని పట్టు చెడావులు, ఎర్రని చేతి సంచీ, మెడలో కెంపులహారం, కెంపుల దుద్దులు, తలలో ఎర్ర గులాబీ, ఆఖరికి వాచీ స్ట్రాపు కూడా ఎరుపే—ఆ పైన "ఈ సాయంత్రము కుంకుమ తోటలకు వెళ్ళాలి" అన్నది. మంత్రముగ్ధునిలా అనుసరించేను.

ఆ సాయంత్రం కుంకుమ తోటల వద్ద జనం బాగావున్నారు. అందులో చాలా మంది జంటలే. చాలామంది మా యిద్దరినీ చూసి 'జంట' అనే అనుకుని వుంటారు నిజానికి ఓ సర్దార్ జీ, ఆయనభార్యా చెట్టాపట్టాలు వేసుకుని మాకేసి తీక్షణంగా చూస్తూ చాలాసేపు దగ్గరలో నిలబడివున్నారు. మేం కదలకుండా ఒక తోటగట్టున కూర్చున్నాం. కల్యాణీదేవి రెప్ప వేయని కళ్లతో కుసుమిస్తూన్న మొక్కల చివుళ్లను చూస్తోంది. నేనామెకు ఎడమ ప్రక్కనవున్నాను. నా చూపులు ప్రకృతిలోని రక్తవర్ణానికి తాళలేకున్నాయి. అస్తమిస్తూన్న సూర్యుడుకూడ కొండల చాటునుంచి అరుణ కిరణాలనే వెదజల్లుతున్నాడు. వాటికి ఎదుటనున్న శిఖరాలు, వాటి అంచునవున్న మంచు ఎర్రగా [illegible]ము. కల్యాణీదే[illegible] [illegible] లేదు. ఆ కుంకుమపూవుల కాంతికి ఆమె పరవశిత్వం చెందుతూంది. ఆమె వొంటిమీదనుంచి వచ్చే సువాసనలు నన్ను వశీకరణం చేస్తున్నాయి. సూర్యుడు అస్తమిస్తూన్న క్షణక్షణానికీ కుంకుమపూవులు రంగు మార్చుకుంటూన్నాయి. ఎరుపు, నీలి, ఊదా...తోటతోటకూ రంగు మార్పు! కల్యాణీదేవి నిమీలిత నేత్రద్వయం వాటి వైపే లగ్నమైవుంది. నా చూపులు నిలకడ లేక కలయ తిరుగుతున్నాయి. చిరుచీకటి పడుతోంది. కుంకుమ పూవులు సంజదీపాల్లాగ కాంతులు వెదజల్లుతున్నాయి. ఆదీపాలు ఆమె చెక్కిలిలో ప్రతిబింబిస్తున్నాయి. నా దృష్టి ఎంత యత్నించినా ఆమె చెక్కిలిమీద నుంచి మరలటం లేదు. ఆ నునుపైన కాంతి కలభాన్ని లాక్కునే జ్యోతిలా నన్నాకర్షిస్తోంది. ఆ క్షణాన నాలో రక్తప్రసారం ఆగిపోయి వుంటుంది. నా మెదడు మంచులా గడ్డకట్టుకుని వుంటుంది. నాకు తెలియకుండానే నా పెదవులు ఏమి చేసేయో, - ఆమె ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లు ప్రక్కకు అదిరిపడడం జరిగింది. ఆమె తేరుకుని నాకేసి క్రూరంగా, దీర్ఘంగా, జాలిగా చూసింది. ఆ కళ్లల్లోంచి నీరు ఏకధారగా కారుతోంది. నా తప్పు నాకు తెలిసింది. నాలో కొంతంత భయం కలిగింది. ఒక్కసారి ఆమె పాదాలమీద వాలబోయాను. ఆమె తటాలున లేచి నిలబడింది. ఈసడింపుగా, సన్నగా ఒక నవ్వు విసిరి, రోడ్డువైపుకు నడచిపోతూంది. నేనూ ఆమెను అనుసరించేను మౌనంగా. ఆమె టాంగాలో కూర్చుని "హౌస్ బోట్ నసీబ్" అంది. నేనూ ఎక్కి ముందుకూర్చున్నాను. బోటు సమీపించగానే టాంగావానికి డబ్బులిద్దా

## సందేశం; సందేహం

రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే, బ్రిటిష్ సేనాధికారుల నుంచి, ఆఫ్రికాలో మారుమూల ఉన్న ఒక సైనికోద్యోగికి ఒక ఉత్తర్వు అందింది యుద్ధం మొదలైంది కాబట్టి శత్రుదేశాల వాళ్లని వెంటనే అరెస్టు చేయవలసిందని ఆ ఉత్తర్వులో ఉంది

కొన్నాళ్లకి ఆ స్థావరంలో అధికారి ప్రభుత్వానికి జవాబు వ్రాశాడు:

"ఉత్తర్వు ప్రకారం ఏడుగురు జర్మన్లను, ముగ్గురు బెల్జియన్లను, ఇద్దరు ఫ్రెంచివాళ్లని, ఒక అమెరికన్‌ను అరెస్టు చేశాము. మనం ఏ దేశంవారితో యుద్ధం చేస్తున్నామో వెంటనే తెలుపవలెను"

మనుకున్న నాకన్న ముందుగా రూపాయి నోటు విసిరేసి ధర్మ గదిలోకి దూసుకుపోయి వది

నా గదిలోకి వెళ్లి తలుపులు గట్టిగా బిగించుకున్నాను ఎక్కడ అనిల్ బాబు వచ్చి బయటకు లాగుతాడోనని భయంగా వుంది ప్రపంచంలోని ఏ శక్తికైనా సరే సిద్ధమయ్యేను కాని, అలాంటిదేదీ జరగలేదు మామూలుగా అయ్యూబ్ ఖాన్ భోజనం యిచ్చి వెళ్లిపోయేడు మళ్లీ నా ద్వాసనాడి గతించిన దినచర్య పునఃస్మరణ చేసుకున్నాను ఇంత చేస్తేగా ప్రవర్తించిన నా మీద నాకే కోపం కలిగింది అనిల్ బాబు సంసారంలో ఒకణ్ణి కాగోరిన నేను ఆఖరికి అనిల్ బాబు నేలయిపోవాలని యత్నించేను ఎంత ద్రోహం?

మరునాటి ఉదయం అయ్యూబ్ ఖాన్ తలుపు కొట్టేదాకా మెలకువరాలేదు అప్పటికి బారెడు ప్రొద్దెక్కింది

"సాహెబ్! ఏమంత గాఢంగా నిద్రపోయేరు? ఆ బాబు వెళ్లిపోయే ముందు ఎన్ని సార్లు పిలిచినా, తలుపు తీయలేదే" అన్నాడు.

"ఏ బాబు?" అన్నాను ఆత్రంతో

అనిల్ బాబూ, సంసారం ఢిల్లీకి వెళ్లిపోయారట ఆ క్షణానికి నా మనస్సు కొంత కుదుటపడ్డా, వాళ్లు నా మూలాన్నే వెళ్లిపోయేరని విచారించేను దానికి సాయం, ఆ వుదయం నేను తలుపు తీయకపోడం వాళ్ళని మరీ కలతపరచి వుంటుంది ఎంత యోచించినా ఇంక ఢిల్లీ వెళ్లి క్షమాపణ చెప్పుకోడం కన్నా గత్యంతరం కనిపించలేదు

పదిరోజులుగడిచేక ఢిల్లీకి బయలుదేరాను రెలుకన్న ముందుగానే నా మనస్సు ఢిల్లీ చేరుకుంది ఆఖరికి రైలూ నా శరీరాన్ని చేరవేసింది స్టేషనులో సామాను వదిలి, తిన్నగా అనిల్ బాబు కోసం వెదక సాగించేను ఆయన యిచ్చిన ఎడ్రసు కొద్దివల్ల నా కొట్టే శ్రమ కలుగలేదు కాని, నేను చేరుకున్నది ఆయన దుకాణం ఇల్లు అక్కడికి మైలున్నదట అనిల్ బాబు నన్ను చిరునవ్వుతో కూర్చోపెట్టి తెప్పించేరు వచ్చింటుంటే లడ్డూలూ, సమోసాలూ తినిపించేరు.

"మేం వచ్చేసేక ఇంకేంమానే'వన్నారు

"విశేషమేం లేదుగాని, మీరంతా అకస్మాత్తుగా వెళ్లిపోడం నాకేం బాగాలేదు" అన్నాను

"ఏం చెయ్యమన్నావు బాబూ! శ్రీనగర్‌లో గడిపిన ఆఖరు రాత్రి మా ఆవిడకు మతి చలించినట్టు భయపడ్డాను ఆ రాత్రి సూది కాల్చి బుగ్గలమీద వాతలు పెట్టుకుంది ఇది మతిస్థిరం వున్నవాళ్ళు చేసే పనేనా?" అన్నారు అనిల్ బాబు మిన్ను విరిగి నా నెత్తిమీద పడినట్లు, నా కాళ్ళక్రింది భూమిగడ్డ ఎవరో పీక్కుపోతున్నట్లు బాధపడ్డాను,

"వాడిదీ ఇప్పుడు బాగున్నది కదా?" అన్నాను

"బాగానే వుంది. చూద్దువుగాని రా" అన్నారాయన ఎందుకో నాకు వెళ్ళడానికి ధైర్యం చాలలేదు

"సాయంత్రం వస్తాను ఇప్పుడు వేరే పనులున్నాయి" అని దాటేసేను నేను వస్తూంటే, వెనక్కి పిలిచి, ఆయన ఇంటి ఎడ్రసు రాసి యిచ్చేరు నేను తిన్నగా స్టేషనుకి వెళ్లి కూర్చుండిపోయేను

ఆ సాయంత్రం కళ్యాణి దీదిని చూడాలని లేచాను కాని, నాలుగడుగులు వేసి, మరి నడవలేక పోయేను. మళ్లీ నా మొహం చూపించి, పిడకలను రెక్కలింపడం యిష్టం లేక ఆగిపోయాను ఇంక నేను వెళ్లి చేసేదేమిటి? క్షమాపణకని జానికి నా క్షమాపణకూ, కన్నంవారక పట్టుబడ్డ గజదొంగ చెప్పే క్షమాపణకూ అర్థంవొకటే అందుకే మానేసేను. నాటికీ, నేటికీ నేను వెళ్లలేదు. అనిల్ బాబు, కళ్యాణీదీదీల స్నేహ సౌహార్ద్రాలను నేను శాశ్వతంగా కోల్పోయాను అయితే నేంగాక? ఆ పోక కళ్యాణీసోదరి నాకీ లోకంలో నాటినుంచి పోంది, లక్షలాది అక్కయ్యలను ప్రసాదించింది



# శ్రీమతులు - శ్రీయుతులు

(గతసంచిక తరువాయి)

సుమిత్ర: మీరు ఆవేశపడకుండా మేం చెప్పినమాటలు వినండి అప్పుడు మీరే మా వాదాన్ని అంగీకరిస్తారు పూర్వం స్త్రీని అబల అనేవారు బుద్ధిబలంలో కాని, భుజబలంలో కాని మగవాడిముందు దేనికీ పనికిరాదనేవారు కాని ఈనాడు జరుగుతున్న దేమిటి? కాలేజీలలోనూ, హైస్కూళ్లలోనూ చదువుతూ-పరీక్షలలో మగవాళ్లు దండయాత్రలు చేస్తూవుంటే - ఆడవాళ్ళు క్లాసువచ్చి మరీ పాసవుతున్నారు

సావిత్రి మగవాళ్ళు సిగ్గుపడవలసిన విషయం యిది

గంగా ఆడదానికి సిగ్గే సింగారం అన్నారు కాని మీరు ఇప్పుడు బరి తెగి తిరుగుతూవుంటే మగవాళ్ళు సిగ్గుపడక ఏం చేస్తారు? అలాగే సిగ్గుపడతారులే చిట్టతల్లీ!

సుమిత్ర స్త్రీలో ఎంత ప్రతిభ వున్నా ఆమెను వంటగదిలో బంధించారు ఇప్పుడిప్పుడే స్త్రీ తన శృంఖలాలను త్రెంచుకుంటోంది ఉద్యోగంలో పురుషునికంటే తెలివైనదనిపించుకుంటోంది ఎంతో మంది చిత్రకారిణులు, కవయిత్రులు, నటీమణులు, గాయకురాండ్రు తలెత్తారు

గంగా: రెండు శేర్ల బియ్యపుగుండిగ ఎత్తేరు కబురు చెబుతారు తల యెత్తారట! ఆడది ఎప్పుడూ వినయవిధేయతలతో తలవంచుకొని పనిచెయ్యాలి అప్పుడు కట్టుకున్న మొగుడూ హర్షిస్తాడు...

(నేపథ్యంలోంచి ఉన్నతంగా స్త్రీల బృందగానం వినిపిస్తుంది గంగాభవాని ఎడమవైపు కోపంతో చూస్తూవుంటుంది సుమిత్ర, సావిత్రి చిరునవ్వుతో పాట వింటూవుంటారు)

బృందగానం:—

మేల్కొన్నాం! మేల్కొన్నాం!
భారత నారీమణులం!
తరతరాల దాస్యంపై
తరగని నైరాశ్యంపై
మ్రోగించాం రణభేరీ
నినదించెను జయభేరీ ॥
స్త్రీలంతా బానిసలా?
వంటచేయు యంత్రాలా? ॥
పరీక్షలలో గెలిచాం
ఉద్యోగాలను నిలిచాం
మేల్కొన్నాం! మేల్కొన్నాం!
భారత నారీమణులం!

గంగా అయ్యో! అయ్యో! యిదెక్కడి ఘోరకలి అత్రా! తప్పట్లు, తాళాలు, మద్దెలు, కుప్పిగంతులు—యిదేం పోయే కాలమ్రా మీకు?—ఇలాంటి మ్లేచ్ఛ కొంపలో నా కోడలు ఒక క్షణం వుండడానికి వీల్లేదు (గట్టిగా) నళినీ! నళినీ! రావే! ఇక బయటకురా! నీకుకూడా యిటువంటి పిదప బుద్ధులు పుట్టుకొస్తున్నాయటే!

## అంగర సూర్యారావు

సుమిత్ర. (సావిత్రితో) నళినిని తీసుకురా! పంపివేద్దాం లేకపోతే యీ బాధ మనం భరించలేం.

(సావిత్రి ఎడమవైపు నిష్క్రమిస్తుంది - ఎడమవైపునుంచి రాజ్యం కోపంతో ప్రవేశిస్తుంది. ఆమె వెనుక బెదురుచూపులు చూస్తూ నళిని వస్తుంది రాజ్యం మెడలో జంధ్యంలా ఒక బెల్టు, ఆ బెల్టుకు ఫ్లాస్కు వుంటాయి)

గంగా (నళినిని చూసి కోపంతో) అబ్బ! నీకోసం అరిచి, అరిచి అలిసిపోయానే!

రాజ్యం. అయ్యో పాపం! అలిసిపోయారా! పోని కొంచెం కాఫీ తాగండి (మెడలోని ఫ్లాస్కు తియ్యబోతుంది)

గంగా అయ్యో! అయ్యో! యిదెక్కడి అన్యాయం! కాఫీని 'గంగాధరుడి' లా మెళ్ళోనే తగిలించుకున్నావ్?—పూర్వం గంగాజలాన్ని కూడా తీసుకువెళుతూ అవసరమైనప్పుడు నెత్తిమీద జల్లుకుంటూ వుండే వాళ్లం—అయ్యో ఖర్మ! ఇప్పుడు కాఫీని మెళ్ళో తగిలించుకు తిరుగుతున్నారట్రా!

రాజ్యం: మీ ఆయన బ్రతికుంటే రోజుల్లో కాలినడకను పదేళ్లకు కాశీవెళ్లేవారు ఇప్పుడుకూడా అలా వెళ్లమంటారా మీరు?

సుమిత్ర: ఇక్కడ ఉదయం విమానం ఎక్కితే సాయంత్రానికి కాశీలో దిగుతాం

గంగా కాశీలో కాకపోతే గంగలో దిగండి—(నళినితో కోపంగా) నీకుకూడా యీ మేళంలో కలవాలని వుందటే! నీకు యిటువంటి చెడుబుద్ధులు పుడుతున్నాయేమిటే?

రాజ్యం (కోపంతో) ఏమండోయ్ నాయనమ్మగారూ! మేళం, తాళం అంటే ఒప్పుకోం యిక్కడకు గౌరవమైన స్త్రీలు వస్తూ వుంటారు, పోతూవుంటారు సంసారం అనే ఎడారిలో మహిళా సంఘం ఒయాసిస్సు వంటిది

గంగా (మరింత కోపంతో) ఆ యింగిలీషే మన కొంపతీసింది కళ్లు తెరవని పిల్లలు మొదలు పెద్దాళ్ళవరకూ అందరూ ఆ కర్మకబురులే! — మా మనుమరాలు—ఐదేళ్ళకుంట - వాళ్ల నాన్నని 'నాన్నగారూ' అని ముద్దుగా పిలవదు 'డాడీ! డాడీ!' అంటుంది

సుమిత్ర (నవ్వుతూ) డాడీ కాదండి! డాడీ!

గంగా ఏదో నా శ్రాద్ధం! (నళినితో) పదవే! అలా దీపం స్తంభంలా నిలబడిపోయావేం!

రాజ్యం ఏమండోయ్ నాయనమ్మగారూ! మీరు నళినిని తీసుకు వెళ్లడానికి వీల్లేదు

గంగా (కోపంతో రాజ్యాన్ని నఖశిఖపర్యంతం చూస్తూ) ఓహో! అంతవరకూ వచ్చిందీ వ్యవహారం! నా కోడల్ని నేను తీసుకు వెళ్లడానికి మధ్యను నీ పెత్తనమేమిటి? బోడి పెత్తనం! - రాతి చిప్పలా మొహం నువ్వూను!

సుమిత్ర ఇది స్వతంత్ర భారతదేశం! మీ యిష్టం వచ్చినట్లు ప్రవర్తించడానికి వీల్లేదు మీ ప్రవర్తనవల్ల సమాజానికి హాని కలగకూడదు అలా జరిగితే మీ మీద ప్రభుత్వం చర్య తీసుకుంటుంది

నళిని (విచారస్వరంతో) నా బ్రతు

కుంటే! నాగురించి మీరు విచారించకండి పోయివస్తాను

గంగా నీ బ్రతుకు కేమే! బంగారంలాంటి బ్రతుకు! పద పద నేను రంగమ్మగారియింటికి వెళ్లిరావాలి ఇంటిలో ఎవరూ లేరు

రాజ్యం (కోపంతో) నళినిని మీరు బలవంతంగా తీసుకు వెళ్ళడానికి వీల్లేదు ఆమె పసిపిల్ల కాదు మీరు చెప్పినట్లు వినడానికి మైనారిటీ వెళ్లినపిల్ల తోచినట్లు నడుచుకునే హక్కు ఆమెకు వుంది

గంగా (కోపంతో హేళనగా) కొంపకు నిప్పుపెట్టుకునే హక్కు కూడా వుందా? (నళినితో) పోతివిగ్రహంలా కదలవేమే!

(నళినిని చెయ్యిపట్టుకుని బలవంతంగా కుడివైపు తీసుకుపోతుంది గంగా భవాని)

రాజ్యం (కోపంతో) సుమిత్రాదేవి గారూ! ఒక సోదరమహిళకు మనకళ్ళముందు యింత ఘోరమైన అన్యాయం జరుగుతూవుంటే మనం కళ్లప్పగించి చూస్తూ వూరుకోవలసిందేనా!

సుమిత్ర: నళినివంటి అభాగినులు యీ సమాజంలో కోటానుకోట్లు వున్నారు రాజ్యం అమాంతంగా మనం ఒక్కసారి పరిసరాలను మార్చలేం క్రమేణా మార్పుతీసుకురావాలి

రాజ్యం పాపం! నళిని ఎంత ముచ్చటైన పిల్ల! నాటకంలో వేషంవెయ్యడానికికూడా అంగీకరించింది నాటకాన్ని జయప్రదంగా నిర్వహించవచ్చుకదా అని సంతోషించాను ఆకస్మికంగా యీ అవాంతరం వచ్చిపడింది

సుమిత్ర కౌసల్యను పురుష వేషం వెయ్యడానికి ఒప్పించుదాం యికమనకు టైం లేదు ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు

రాజ్యం కౌసల్యను నమ్మడానికి వీలేదు సమయానికి కనబడదు ఆమె భర్త మంచివాడు కాదు

సుమిత్ర (రిస్టువాచీ చూసి) అప్పుడే చాలా టైం వృథాగా గడిచిపోయింది (కుడివైపు చూస్తూ) అదుగో! కౌసల్య వస్తున్నట్టున్నది చూడు!

(కుడివైపునుంచి బెదురుచూపులు చూస్తూ నళిని ప్రవేశిస్తుంది)

రాజ్యం (సంతోషంతో) నళినీ! నువ్వా! ఎలా రాగలిగావ్?

నళిని మా అత్తరంగమ్మ పిన్నిగారింటికి వెళ్లింది రాత్రి పది గంటలకు కాని తిరిగి రాదు మరికొంతసేపు యిక్కడే సంతోషంగా గడపవచ్చని వచ్చాను

రాజ్యం చాలా మంచిపనిచేశావు నళినీ! రిహార్సల్సు మొదలెడదాం

సుమిత్ర నళినితో వేషం వేయించడం మంచిది కాదు రాజ్యం వాళ్ల అత్త మళ్లీ వచ్చిందంటే కొంపకి పందిరేస్తుంది.

నళిని. ఫరవాలేదండి నాకు కూడా ఒకసారి అలాంటి వేషం వెయ్యాలని వుంది

రాజ్యం భలేపిల్లవు నళినీ నువ్వు మాతో వుండడానికి పనికొస్తావు యీ రాత్రి రిహార్సల్సు పూర్తి అయితే రేపు నాటకసమయానికి ఏదో ఉపాయంతో నిన్ను తిరిగి తీసుకురావచ్చు

నళిని: ఇప్పుడు నేనేం చెయ్యాలండి?

సుమిత్ర: లోనికివెళ్లు సావిత్రి వేషం వేసుకుంటోంది నువ్వుకూడా ఆమె చెప్పినట్లు వేషం వేసుకో

రాజ్యం. వద్దు నేనే స్వయంగా నీకు మేకప్ చేస్తాను. నిన్ను నూటికి నూరుపాళ్లు మగవాడిలా తయారుచేస్తాను. నాతోరా!

(ముందు రాజ్యం తరవాత నళిని ఎడమవైపు నిష్క్రమిస్తారు సుమిత్ర తిరిగి తన అధ్యక్షోపన్యాసం చదువుకుంటూ వుంటుంది — ఎడమవైపునుంచి సావిత్రి వస్తుంది వేషం మార్చుకొంది కొత్తగా పెళ్లి అయిన యువతిలా పరికిణీ, ఓణీ వేసుకుంది వాలుజడ, నుదుట తిలకం, తీర్చిదిద్దిన కనుబొమ్మలు, 16 ఏళ్ల యువతిలా కనిపిస్తుంది.)

సావిత్రి. (పేపరు చదువుతూ) అక్రమసంతానానికి ఆస్తి హక్కు రద్దు.

సుమిత్ర: (ఉలికిపడి) ఘోరం! చాలా అన్యాయం మగవాళ్లు అధికారంలో వుండి చేసిన అన్యాయాలలో యిది ఒకటి! సంతానం అనేది కేవలం స్త్రీల సమస్య పెద్దవాళ్లు చేసిన తప్పులకు పసిపిల్లలను శిక్షించడం ఘోరాతిఘోరం!

సావిత్రి ఇంతేకాదు యింకా చాలా అన్యాయాలు జరుగుతూ వున్నాయి (పేపరు చదువుతూ) స్త్రీలకు తండ్రి వాటాలో మాత్రమే ఆస్తి హక్కు!

సుమిత్ర. (కోపంతో లేచి) ఈకాలంలో కూడా స్త్రీలకు యింతటి అన్యాయం జరుగుతూ వుండడం సహించరాని విషయం. ఇంతకూ యింత అన్యాయం జరగడానికి కారకులం మనమే! భారతదేశంలో పురుషులకంటే స్త్రీల సంఖ్య హెచ్చు అయినప్పటికీ శాసనసభలలో మనకు తగిన ప్రాతినిధ్యం లేదు మన మహిళల వోట్లతో పురుషులు గద్దెనెక్కి మనకే ద్రోహం చేస్తున్నారు ఈ పరిస్థితిని మహిళాజగత్తు గుర్తించాలి (ఉద్రేకంతో) రేపటి ఎన్నికలలో మన మహిళలందరూ పార్టీ భేదాలు లేకుండా పోటీచేసి మగవాళ్లను చిత్తుగా ఓడించాలి శాసనసభలను మన హస్తగతం చేసుకోవాలి తరతరాలుగా మనకు జరుగుతున్న అన్యాయాలను సమూలంగా తుడిచివెయ్యాలి. మైనారిటీ వర్గానికి చెందిన పురుషజాతిని మూలకూర్చోబెట్టాలి (కలం తీసి) రేపటి నా అధ్యక్షోపన్యాసంలో ఈ విషయం కూడా చేరుస్తాను (కూర్చుని రాస్తుంది)

సావిత్రి మీరు మీ అధ్యక్షోపన్యాసంలో మరొక విషయంకూడా చేర్చాలండి

సుమిత్ర. ఓ! నిస్సంకోచంగా చేరుస్తాను అన్ని విషయాలను కూలంకషంగా చర్చిస్తూ ఉపన్యసించ దలుచుకున్నాను

సావిత్రి బాగా చదువుకొని పత్రికలలో పనిచేస్తున్న కొందరు స్త్రీలు మన సమస్యలను గురించి ఏమీ రాయడంలేదు

సుమిత్ర అవును! నిజమే! ఆ విషయం కూడా మాట్లాడతాను (అధ్యక్షోపన్యాసంలో రాసుకుంటుంది)

సావిత్రి మరొక అమోఘమైన విషయం వుంది మగవాళ్లు ఆడవాళ్ల పేర్లు పెట్టుకొని రహస్యంగా జుగుప్సాకరమైన ప్రణయ కథలు రాస్తున్నారు

సుమిత్ర. అది నిజమే! అసలు ప్రణయ కథలే స్త్రీల అభ్యుదయానికి గొడ్డలిపెట్టు (ఏదో ఆలోచన తట్టినట్లు) అవును ఇది మంచి ఆలోచన. యీ ప్రణయకథలు రాసేవాళ్ళందరికీ నిరసన పత్రాలు పంపుదాం

సావిత్రి ఓ! నైస్ గా వుంటుంది వాళ్ళ జాబితా తయారు చేస్తాను

సుమిత్ర. (ఆలోచిస్తూ) అసలు ఈ ప్రణయం అనేదే స్త్రీలను బానిసలుగా మార్చింది మన ప్రబంధాలన్నీ స్త్రీలను నఖశిఖ పర్యంతం అంగుళం మేర అయినా వదలకుండా వర్ణించి పారేసినై లోలాక్షీ, చపలాక్షీ, పాటలాధర మొదలైన దవడనొప్పి పదాలతో మనల్ని వర్ణించారు ఇది అంతా ఎందుకుజరిగింది? అంటే ఒకటేసమాధానం సమాజంలో మనకు స్వేచ్ఛ లేక పోవడమే!

(బిగ్గరగా గంట వినిపిస్తుంది సుమిత్ర ప్రసంగాన్ని మధ్యలో ఆపుతుంది)

రాజ్యం: (నేపథ్యంలోంచి) వేషం పూర్తి అయ్యింది. హాలును రంగస్థలంగా మార్చండి

# ★ శ్రీమతులు - శ్రీయుతులు ★

(సుమిత్ర, సావిత్రి తొందరగా బల్లలు సర్దుతూ వుంటారు. దీపాలు ఆరిపోతాయి కొన్ని క్షణాలపాటు రంగస్థలాన్ని చీకటి ఆవరిస్తుంది)

సావిత్రి. (ప్రశాంత స్వరంతో) "స్త్రీ జీవితంలో ఆవరించిన చిమ్మ చీకట్లు యిప్పుడిప్పుడే తొలగి పోతున్నవి"

(రంగస్థలం మీదికి మెల్లగా వెలుగు ప్రసరిస్తుంది. సావిత్రి సోఫాలో కూర్చుని పుస్తకం చదువుతోంది) "ప్రపంచం పురోగమిస్తున్నది నేటి వరకూ చీకటిలో అణగి మణగి వున్న అన్యాయాలు యిపుడిపుడే బయట పడుతున్నాయి"

(ఎడమవైపునుంచి నళిని పురుష వేషంలో తొందరగా ప్రవేశిస్తుంది ఫుల్ ఫాంట్, బుష్‌కోటు, హేట్, సన్నని మీసం— అచ్చు మగవాడిలా వుంటుంది ఈ వేషంలో నళినిని ఎవరూ ఆనవాలు పట్టలేరు.)

నళిని (అధికార స్వరంతో) ఏం చేస్తున్నావ్? ఇంకా చదువుతూ కూర్చున్నావా?

సావిత్రి (వినయంగా) మీ కోసం ఎదురు చూస్తున్నానండి. ఇంత ఆలస్యమయ్యిందేం?

నళిని: (గదిలో కలయ తిరుగుతూ) ఉద్యోగం అంటే వంట చెయ్యడం అనుకున్నావా? ఎంత కష్టం! ఏం కథా!— మా కష్టసుఖాలు యింట్లో కూర్చునే మీ ఆడవాళ్ళకు ఏం తెలుస్తాయి?

సావిత్రి. గుమస్తా ఉద్యోగం కష్టం కాని మీ ఉద్యోగానికేమండి! విశ్రాంతిగా కుషన్ కుర్చీలో కూర్చోవచ్చు

నళిని (కోపంతో) ప్రతివాడూ అక్కడే పొరబాటు పడుతున్నాడు అధికారుల ఉద్యోగాలవంటి కష్టమైన ఉద్యోగాలు-అసలు యీ రోజుల్లో లేనేలేవు. ఒక గుమస్తా కొంచెం పొరబాటు చేశాడో-వెంటనే ప్రభుత్వం అధికారి గొంతు పట్టుకుంటుంది.

సావిత్రి ఆ విషయాలన్నీ నా కేలా తెలుస్తాయి చెప్పండి

నళిని. తెలుసుకోవాలి. సంవత్సరంనుంచి కాపరం చేస్తున్నావ్. ఇంకా యీ విషయాలెప్పుడు తెలుసుకుంటావు?-సరే దానికేం గాని - ఫ్లాస్కులో కాఫీవుందా?

(సావిత్రి ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసియిస్తుంది. నళిని తాగుతూ వుంటుంది.)

సావిత్రి. (వినయంతో) ఇవేళ మహిళా మండలి సమావేశానికి వెడతానండి.

నళిని: (కోపంతో) నో! నో! అటువంటి అనవసర విషయాలలో కలగ జేసుకోవద్దు.

సావిత్రి (భయభక్తులతో) మా స్నేహితురాలు ఒకామె మహిళా సంఘానికి కార్యదర్శిని ఆమె రమ్మని బలవంతం చేస్తోందండి ఒక క్షణం వుంటే ఆమె యిక్కడికే వస్తుంది ఆమెను మీకు పరిచయం చేస్తాను

నళిని (భయంతో ఒక్కసారి) చంపేవ్! అటువంటి పని మాత్రం చెయ్యకు నాకు పెద్దపులిని చూసినా భయంలేదు కాని యీ మహిళా సంఘం సభ్యురాండ్రను చూస్తే వల్లమాలిన భయం-ఒక్కసారి పరిచయం చేశావో ప్రతిసారి చందా యివ్వమనో, నాటకానికి టిక్కెట్ కొనమనో సిద్ధమవుతూ వుంటారు వాళ్ళమాటకు ఎదురు చెప్పామా! ఇక చచ్చాం అన్నమాటే!

సావిత్రి ఎవరూ చందాలు యివ్వకపోతే యీ సంఘాలు ఎలా నడుస్తాయండీ!

నళిని (కోపంతో) నడవకపోతే పడుకోనియ్ ఈ సంఘాలన్నీ నడిచి ఎవరిని ఉద్ధరించాలి?-నాకూ యీ మహిళా సంఘాల గురించి కాస్తో కూస్తో తెలుసు పనిపాటు



రజకుడు

—చిత్రకారుడు : శీలా వీర్రాజు, రాజమండ్రి.

లేని ఆడవాళ్లు అంతా అక్కడ చేరతారు. చేరి వూరుకుంటారా అంటే అదీ లేదు యీ చీర కొయంబత్తూరుదా, మైసూరుదా, బెంగుళూరుదా, కుంభకోణానిదా అంటూ చర్చ సాగిస్తారు. ఆ తరవాత యిళ్ళకు వచ్చి ఆ చీర కొనేవరకూ మగవాణ్ణి వేధిస్తారు

సావిత్రి. మీవంటి చదువుకున్న వాళ్లు కూడా అలా మాట్లాడితే ఎలాఅండి మీరు చెప్పినవన్నీ వెనకటిరోజులలో జరిగేవేమో కాని యిప్పుడు జరగడంలేదు ఈనాడు స్త్రీలు చీరలగురించి, అలంకరణ గురించి చర్చించడమే లేదు అంతకంటే గొప్పసమస్యలు—చర్చించవలసినవి—ఎన్నో వున్నాయ్ మరొకక్షణం ఆగండి మా స్నేహితురాలు వస్తుంది ఆమె మీకు అన్ని విషయాలు నచ్చచెపుతుంది

నళిని (తొందరగా) లాభం లేదు అవన్నీ వినేతీరిక నాకులేదు చాలాపని వుంది ఒకగంటలో తిరిగివస్తాను.

(నళిని ఎడమవైపు నిష్క్రమిస్తుంది సావిత్రి నిస్పృహతో సోఫాలో కూలబడుతుంది ఎడమవైపునుంచి తొందరగా రాజ్యం ప్రవేశిస్తుంది ఈసారి వేషంమార్చి మహిళాసంఘం సెక్రటరీ హోదాలో వస్తుంది.)

రాజ్యం: అరే! నువ్వింకా తయారు కాలేదేం?

సావిత్రి· మావారు వెళ్లవద్దంటున్నారు

రాజ్యం ఈ మగాళ్లతోవున్న బాధే యిది ఇదేం కొత్తవిషయం కాగ మీఆయనతో నేను మాట్లాడతాను ఏరీ? ఎక్కడవున్నారు?

సావిత్రి: ఇప్పుడే అలా వెళ్లారు

రాజ్యం మరేంఫరవాలేదు నువ్వు బట్టలుమార్చుకొని సిద్ధంగావుండు నేను అలా పైవీధికివెళ్లి మాలతిని, కనకవల్లిని తీసుకువస్తాను

సావిత్రి (విచారంతో) వద్దు—ఈసారికి నన్ను. . . .

రాజ్యం: (కోపంతో) అదేంవీల్లేదు నేను యిప్పుడేవస్తాను నువ్వు సిద్ధంగా వుండాలి

(రాజ్యం ఎంతతొందరగా వచ్చిందో అంతతొందరగా నిష్క్రమిస్తుంది సావిత్రి సోఫాలో కూర్చుని ఆలోచిస్తూవుంటుంది ఎడమవైపునుంచి తిరిగి పురుషవేషంలో నళిని ప్రవేశిస్తుంది ముఖంలో ఆకస్మికంగా మార్పువచ్చింది కోపం తాండవమాడుతోంది)

నళిని: (కోపంతో) ఇంతటి అన్యాయం జరుగుతుందని నేను కలలోకూడా వూహించలేదు.

సావిత్రి: (ఆత్రుతతో భర్తను సమీపించి) ఏమయ్యిందండీ?

నళిని మీనాన్న యింతటి ఘోరానికి పూనుకుంటాడని నేను ఎన్నడూ అనుకోలేదు.

సావిత్రి: మానాన్న ఏంచేశాడండీ?

నళిని. (కోపంతో) ఏంచేశాడా? నన్ను అవమానంపాలు చేశాడు

సావిత్రి: ఏమిటో చెప్పకుండా అలా కేకలు వేస్తే నాకేం తెలుస్తుందండీ?

నళిని ఈదుర్వార్త నాకు యిప్పుడే తెలిసింది మీనాన్న మీచెలికి పెళ్లికుదిర్చాడు

సావిత్రి (సంతోషంతో) నిజమే! ఇంతటి శుభవార్తకు సంతోషించడంపోయి విచారిస్తారేమిటండీ?

నళిని (మరింతకోపంతో) ఇది నీకు శుభవార్తే! కాని నాకుమాత్రం దుర్వార్త అసలు విషయం చెబుతున్నాను విను మీనాన్న ఈపెళ్లి ఎలాచేస్తున్నాడో తెలుసా? ఐదువేలు కట్నంయిచ్చి మరీచేస్తున్నాడు

సావిత్రి కట్నం ఎంతైతే ఏమిటెండి. సంబంధం మంచిదయితే ఫరవాలేదు

నళిని (కోపంతో)ఆ! ఏమంటున్నావ్! చిన్నఅలుడికి కట్నం ఎంతయిచ్చినా ఫరవాలేదా?—నాకు మూడువేలు కట్నంయిచ్చి చిన్నఅల్లుడికి ఐదువేలు కట్నం యిస్తాడా? ఇంతటి అవమానాన్ని నేను భరించలేను

సావిత్రి పోనివ్వండి ఇటువంటి శుభసమయంలో మనం పేచీపెట్టడం మంచిది కాదు

నళిని (కోపంతో) అలాంటికబురు మన దగ్గరేం లాభంలేదు. ఇద్దరు అల్లుళ్లకు సరిసమానంగా కట్నం ఇవ్వవలసిందే!

సావిత్రి (బతిమాలే ధోరణిలో) నామాట విని కనీసం యీపెళ్లి అయ్యేవరకైనా వూరుకోండి

నళిని. వీలేదు ఒకక్షణం కూడా వూరుకోను ఇది పరువుప్రతిష్ఠలకు సంబంధించిన విషయం. నాకంటే ఆ కాబోయే చిన్నఅల్లుడు ఎందులో ఎక్కువ?

సావిత్రి అది నాకెలా తెలుస్తుందండీ?

నళిని: నేను బి ఏ పాసై గొప్పవుద్యోగం చేస్తున్నాను అటువంటినాకు—చచ్చు మూడువేల రూపాయలు కట్నం యిస్తాడా? ఇంటర్మీడియట్ పరీక్షలో ఐదేళ్ళనుంచి మొగ్గలు వేస్తున్నవాడికి ఐదువేలు కట్నం ఇస్తాడా? ఈ అన్యాయాన్ని నేను ఎంతమాత్రం సహించను

సావిత్రి అప్పటికంటే ఇప్పుడు కట్నం ధరలు పెరిగినవేమో, వూరుకోండి

నళిని మనకు పెళ్లిఅయి ఎంతకాలం అయ్యింది? కేవలం ఒక్కసంవత్సరం ఒక సంవత్సరానికి రెండువేల రూపాయల నష్టమా?

సావిత్రి నామాటవిని వూరుకోండి మనకు నెలకు రెండువందల రూపాయల జీతం వస్తోంది దేనికీఇబ్బందిలేదు ఇలాంటి చిన్నవిషయాల దగ్గర మనం పేచీపెడితే మర్యాదగా ఉండదు

(56-వ పేజీ చూడండి)



"అషాఢస్య ప్రథమ
దివసే ”
—ఫొటో: వి దుర్గా
ప్రసాద్



ఎ. వి. ఎం.వారి "చోరీ చోరీ"లో నర్గీస్, రాజ్ కపూర్.



"టాన్‌బస్" చిత్రంలో అంజలి   ఈ చిత్రాన్ని శ్రీరామ్ ప్రొడక్షన్సువారు
తెలుగులోకి డబ్ చేస్తున్నారు.



మహీం వారి "శ్రీ గౌరీమాహాత్మ్యం"లో సీత, శ్రీరంజని, సూర్యకాంతం, ముక్కామల

# "ఇలవేలుపు" సమీక్ష

లక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి చిత్రం "ఇలవేలుపు" గతమాసం ఆంధ్రదేశంలో విడుదలయినది. ఈ చిత్రాన్ని శ్రీ యోగానంద్ డైరెక్ట్ చేశారు. శ్రీ ఎల్. వి. ప్రసాద్ పర్యవేక్షణ చేశారు. నాగేశ్వరరావు, అంజలీదేవి, రేలంగి, జమున, కృష్ణకుమారి, గుమ్మడి, రమణారెడ్డి, డా॥ శివరామకృష్ణయ్య, సూర్యకాంతం, అల్లు రామలింగయ్య, వీరం మొదలైనవారింగులో నటించారు. మాటలు పినిశెట్టి, పాటలు శ్రీశ్రీ, కొసరాజు, అనిసెట్టి, వడ్డాది, కథ సదాశివబ్రహ్మం వ్రాశారు. కెమెరా కె. ఎస్. ప్రసాద్, సంగీతం దక్షిణామూర్తి నిర్వహించారు.

ప్రకృతి ఆశ్రమంలో అసలుకథ ప్రారంభమవుతుంది. ఆశ్రమంలో శారద అనే యువతి ఆశ్రమాధికారి శిక్షణలో పెరిగి పెద్దది. గొప్ప త్యాగశీలం అలవరచుకుంటుంది. స్నేహితుని వైద్యంకోసం అక్కడకు వచ్చిన శేఖర్ అనే యువకుడు ఆమెను ప్రేమిస్తాడు. ఆమె కూడా అతన్ని ప్రేమిస్తుంది. శేఖర్ సైనా పర్యటనకు బయలుదేరి వెళుతూ దారిలో విమానం కూలిపోగా అటవిక జాతులవారి చేత రక్షింపబడతాడు. అతడు చనిపోయాడని శారద, శేఖర్ తండ్రి, తదితరులు భావిస్తారు. శారద తన ప్రియునికోసం గర్భిణ్యానే, తన అసలు తండ్రి బలవంతం చేత శేఖర్ తండ్రిని వివాహమాడుతుంది. అయితే అతడు శేఖర్ తండ్రి అని ఆమెకు, ఆమె తన కుమారుని ప్రేయసి అని శేఖర్ తండ్రికి తెలియదు. శేఖర్ గాయాలు నయమవుతుంది.

మైన తరవాత క్షేమంగా తిరిగి వస్తాడు. తన ప్రేయసి మరొకర్ని వివాహం చేసుకుందని తెలిసి భగ్నహృదయుడై తాగుడు అలవాటు చేసుకుంటాడు. ఆమె తన తండ్రినే వివాహం చేసుకుందని తెలిసి, ఆమె చేసిన బోధ వల్ల మనసు కుదుటపరచుకొని ఆమెను తల్లిగా చూసుకుంటాడు. తరవాత అతన్ని ఒప్పించి శారద అతని మేనమామ కూతురయిన శాంతనిచ్చి వివాహం చేయిస్తుంది. తరవాత తన భర్త తననలక్ష్యం చేసి శారదనే అధికంగా చూస్తున్నాడని క్షోభ పడుతుంది. దీనికితోడు శారదా శేఖర్‌ల పూర్వ సంబంధం తెలిసిన ఒక స్నేహితురాలు తరవాత వచ్చి, శారదా శేఖర్‌లు ప్రేమించుకుంటున్నారని చెబుతుంది. తరవాత తన భర్తా, శారదా నిజసంబంధం అంటగడుతుంది. దీన్ని భరించలేక శేఖర్ ఇల్లు విడిచి వెళ్ళిపోతాడు.

శారద అతన్ని వెదికి వెదికి తిరిగి ఇంటికి తీసుకువస్తుంది కాని, తరవాత శారద, తన భర్త ఒకరినొకరు చూసుకోరాదని ఆంక్ష పెడుతుంది. శేఖర్‌కు జబ్బు చేసి ఎన్నో రోజు

లహా నయంకాక చావుబ్రతుకుల స్థితిలో ఉంటాడు. అప్పుడు శారద అతనికి నయమయేదాకా ఉపవాసం ఉంటానని ప్రతిజ్ఞ పట్టి రామనామం జపిస్తూ ఉంటుంది. చివరకు తరళ శారదా శేఖరుల నిష్కల్మష ప్రవర్తనను తెలుసుకుని పశ్చాత్తాపపడుతుంది. శారదహస్తస్పర్శతో శేఖర్‌కు స్వస్థత చేకూరుతుంది. కాని శారద చనిపోతుంది. ఆమె చనిపోయిన మూడు నెలలకు తరళకు ఆడపిల్ల జన్మిస్తుంది. శారదయే తిరిగి ఆ పిల్లరూపంలో జన్మించిందని శేఖర్, తరళ భావించి సంతోషపడతారు.

శారదపాత్రలో ప్రేక్షకులను ముగ్ధులుగా చేసే త్యాగం, సహనం, ప్రేమ, వాత్సల్యం మొదలైన సకల సద్గుణాలు పుంజీభవించి ఉన్నాయి. ప్రకృతి ఆశ్రమంలోని రోగులకు పరిచర్యలు చేయడంలోను, శేఖర్ పైన ప్రేమను వాత్సల్యంగా మార్చుకొని అతన్ని సన్మార్గానికి తీసుకురాగలగడంలోను, దుడుకు స్వభావంగల తరళను సరళగా చేయడంలోనూ, వృద్ధభర్తతో కాపురం చేస్తూ సవతిపిల్లలను సాకడంలోను శారద ఆదర్శ హైందవ నారిగా చిత్రింపబడింది. ఈ పాత్రను అంజలీదేవి బహు సమర్థతతో, గొప్ప నటనతో నిర్వహించింది. చిత్రానికి ఆమె నటన వన్నె తెచ్చిందనవచ్చును. గారాబంగా పెరిగి తొందరపాటు స్వభావం పెంచుకున్న తరళపాత్రను జమున చక్కగా నటించింది. భగ్నప్రేమికుడుగాను, ప్రేమించిన యువతి సవతితల్లిగా మారేసరికి కుమారుడుగాను మారిన శేఖర్ పాత్రను నాగేశ్వరరావుకూడా బాగా నటించాడు.

తరళ అన్నగారుగా రేలంగి హాస్యం సమకూర్చడమే కాక, గయ్యాళిగంప యైన తల్లిని, నోట్లో నాలిక లేని తండ్రిని బుద్ధి చెప్పి మంచిమార్గానికి తీసుకురావడానికి నాటకాలుకూడా ఆడి చక్కగా నటించాడు. గయ్యాళిగంపగా సూర్యకాంతం బాగా ఒప్పించింది. మిగతా నటీనటులు అందరూ నిపుణంగా నటించారు.

కొన్ని హిందీ పాటల అనుకరణలు తప్పిస్తే దక్షిణామూర్తిగారిచ్చిన సాంప్రదాయిక సంగీతం శ్రావ్యంగా, పాటలు హాయిగా ఉన్నాయి

చిత్రంలో ప్రకృతి ఆశ్రమానికి చాలా ప్రాధాన్యం ఉన్నది. సకల వ్యాధులకు ప్రకృతి చికిత్సయే పరమోపాయమనే సిద్ధాంతం ఈ చిత్రంలో ప్రతిపాదించబడింది. దీనికి అనుగుణంగానే మానవుల స్వభావంలోని చెడ్డతనాన్ని మంచితనంతోనే తొలగించాలనే మరొక సిద్ధాంతం కూడా నిరూపించబడింది. ప్రేమ విశాలమైనదనీ, ప్రేమకు పెళ్ళితో సంబంధంలేదని, పెళ్ళి కేవలం సాంఘిక మర్యాద అనీ, చదువుకంటె సంస్కారం గొప్పదనీ శారద పాత్ర ద్వారా నిరూపించబడింది. హాస్యపాత్ర ధరించిన రేలంగి కూడా సిద్ధాంతీకరిస్తూ భార్యాభర్తలు బండిచక్రాలవంటి వారని, రెండుచక్రాలు సమంగా నడిస్తేనే బండి ముందుకు పోతుందనీ అంటాడు. ధూమపానం, మద్యపానంవలన కలిగే అనర్థాలను కూడా ఈ చిత్రంలో చూపించారు. ఈవిధంగా ఈ చిత్రం వినోదంతోపాటు ప్రజలకు నీతినికూడా ప్రబోధిస్తున్నది. అందరూ చూడదగిన చిత్రం.



## సమతా వారి “అమరజీవి”

సమతా పిక్చర్స్‌వారు “అమర జీవి” అనే సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు. సావిత్రి, పద్మిని, ఇ. వి. సరోజ, నాగయ్య, శివాజీ గణేశన్ మొదలగువారు పాల్గొంటున్నారు. దర్శకుడు శ్రీ తాతినేని ప్రకాశరావు, మాటలు పాటలు శ్రీ శ్రీ, సంగీతం శ్రీ చలపతిరావు, ఛాయాగ్రహణం శ్రీ కమల్ ఘోష్, చిత్ర నిర్మాత శ్రీ పి. వి. వి. సత్యనారాయణమూర్తి.





సమతా పిక్చర్స్‌వారి “అమరజీవి”లో పద్మిని, సావిత్రి.



సత్యేన్ బోస్ కొత్త చిత్రం "ఏక్ గాఁవ్ కీ కహానీ"లో మాలాసిన్హా, అభిభట్టాచార్య.

## 'పరదేశి'లో పద్మిని

15వ శతాబ్దంలో మనదేశం వచ్చిన సోవియట్ యాత్రికుడు "నికితిన్" పర్యటన విశేషాలు ఆధారంగా తయారవుతున్న చిత్రం "పరదేశి"లో తమిళ నాట్యతార పద్మిని బుక్ అయింది. "నయా సంసార్ ఇంటర్నేషనల్" అనే భారతీయ సంస "మాస్ ఫిలింస్టుడియో" అనే సోవియట్ కంపెనీ కలసి దీన్ని నిర్మిస్తున్నాయి. భారత దేశం తరఫున, "నయా సంసార్" కంపెనీ అధిపతి శ్రీ క్వాజాఅహమద్ అబ్బాస్ దీనికి సంయుక్తదర్శకుడు. నర్గీస్, బల్ రాజ్ సాహ్నీ, పృథ్వీరాజ్, జైరాజ్, మన్మోహన్ కృష్ణ ప్రధానపాత్రలు ధరిస్తున్నారు.

ఈ చిత్రంలో కొన్ని నృత్యాలకు, పద్మిని అక్కచెల్లెళ్లు లలిత, రాగిణులను కూడా తీసుకోవడం జరుగవచ్చునట.

* * *

## ఆంధ్రలో "సినిమా స్కోప్"

ఆంధ్రరాష్ట్రంలో సినిమాస్కోప్, విస్టా విజన్ మొదలైన, కొత్త ప్రాజెక్షన్లకోసం పెద్ద పెద్ద తెరలు అమర్చినపుడు, ఆయా థియేటర్లలో ప్రేక్షకుల స్థానాలను ఎలా ఏర్పాటు చేయాలన్న విషయమై ప్రవీణుల సంఘం ఇటీవల విజయవాడలో సమావేశమై చర్చలు జరిపింది.

ఆంధ్రప్రభుత్వం, రెవెన్యూబోర్డు ద్వితీయ సభ్యుడు శ్రీ ఎం. పి. పాయ్ అధ్యక్షతన ఈ సంఘాన్ని నెలకొల్పింది.

పెద్ద తెరలు అమర్చినపుడు, ప్రేక్షకుల స్థానాలలో మొట్టమొదటి వరుసకు, తెరకూ ఉండే దూరం, తెర వెడల్పులో మూడో వంతు ఉండాలని బొంబాయి ప్రభుత్వం లోగడ నిర్ణయించారు.

ప్రవీణుల సంఘం ఈ అంశాన్ని కూడా పరిశీలించారు. కాని, ఇంకా తుదినిర్ణయం చెయ్యలేదు. ఈ సమావేశంలో ఆంధ్ర పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ శ్రీ పి. కె. మోనప్ప, స్థానిక సంస్థల అధికారి శ్రీ రాఘవ రెడ్డి, ఆరోగ్యశాఖాధికారి శ్రీ జి. వి. ఎస్. నాయుడు, పబ్లిక్ వర్క్స్ శాఖ సూపరింటెం

డింగ్ ఇంజనీరు శ్రీ ఎం. ఎ. రెహమాన్, చలనచిత్ర పరిశ్రమ తరఫున ఆంధ్రఫిలిం వాణిజ్యమండలి ఉపాధ్యక్షుడు శ్రీ అశ్వత్థ నారాయణ పాల్గొన్నారు.

బొంబాయి ప్రభుత్వ నిర్ణయమే ఆంధ్రలో కూడా అనుసరించడం మంచిదని, శ్రీ అశ్వత్థ నారాయణ సూచించారు.

* * *

## 'విక్రం స్టుడియో' ప్రారంభోత్సవం

మద్రాసులో మరో స్టుడియో జూన్ 30 న సలాంఛనంగా అవతరించింది. ఛాయాగ్రాహకుడుగా, నిర్మాతగా, దర్శకుడుగా మంచిపేరు గడించుకొన్న శ్రీ బి. ఎస్. రంగా దీన్ని నెలకొల్పారు. కోడంబాకం ఆర్కాట్ రోడ్‌లో 'చందమామ' భవనాలకు అభిముఖంగా వెలసిన ఈ స్టుడియోను, జెమినీ స్టుడియో అధిపతి శ్రీ ఎస్. ఎస్. వాసన్ జూన్ 30 సాయంకాలం ప్రారంభోత్సవం చేశారు. నిర్మాతలూ దర్శకులూ, నటీనటులు, ఫిలిం పరిశ్రమలోని ఇతర ప్రముఖులూ పలువురు ఉత్సవానికి వచ్చారు.

ఈ సందర్భంలో నే, రంగాగారు నిర్మిస్తున్న కొత్త చిత్రం "మార్కండేయ"కు కూడా ప్రారంభోత్సవం చేశారు. ఈ చిత్రాన్ని తెలుగు, తమిళ, కన్నడభాషలలో నిర్మిస్తారు.

స్వయం కృషి ద్వారా శ్రీ రంగా నెలకొల్పిన ఈ "స్టుడియో", దిన దిన ప్రవర్ధమానమై తెలుగువారికి గర్వకారణం కాగలదని ఆశిస్తున్నాము.

* * *

## "భక్తరామదాసు"

నటుడు శ్రీ చిత్తూరు నాగయ్య "భక్త రామదాసు" కథను చలనచిత్రంగా నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి, మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకాల వెంకట రాజమన్నార్ జూన్ 25 ఉదయం వీనస్ స్టుడియోలో ప్రారంభోత్సవం చేశారు. చలనచిత్ర పరిశ్రమలో ప్రముఖులు పలువురు ఉత్సవంలో పాల్గొని, నాగయ్యగారికి శుభాకాంక్షలు తెలియచేశారు.

నాగయ్యగారు ఈ చిత్రాన్ని కీ. శే. బళ్ళారి రాఘవకు అంకితమివ్వ సంకల్పించారు. ఇకేకాక, ఇటుపై తాము నిర్మించే చలనచిత్రాలను, కీర్తిశేషులయిన కళాకారులకు అంకితమివ్వదలచామన్నారు.

దీనితరువాత "తంగమెతంగం" అనే తమిళ చిత్రం నిర్మింపనున్నట్లు ఆయన ఈ సందర్భంలో చెప్పారు.

"రామదాసు" చిత్రానికి శ్రీ సముద్రాల రాఘవాచార్య మాటలూ పాటలు వ్రాస్తున్నారు. శ్రీ ఓగిరాల రామచంద్రరావు సంగీతం సమకూర్చుతారు. శ్రీ రహమాన్ ఛాయాగ్రహణం నిర్వహిస్తారు.

శ్రీయుతులు నాగయ్య, లింగమూర్తి, గోవిందరాజుల, పసల సూర్యచంద్రరావు, రామశర్మ, గౌరీనాథశాస్త్రి, చదలవాడ, రమణారెడ్డి, శీర్ల బ్రహ్మయ్య, శ్రీమతులు కన్నాంబ, సూర్యకుమారి మొదలగువారు పాల్గొంటారు.

చిత్రనిర్మాణం వీనస్ స్టుడియోలో జరుగుతుంది. ★



పారమౌంట్ వారి కామెడీ చిత్రం "ఆర్టిస్ట్స్ అండ్ మోడల్స్"లో డెర్లీ మెక్లెయిన్, జెరీ లూయిస్.

డిటెక్టివ్ సీరియల్

మూలం: ఎడ్గార్‌వాలెస్

# అరుణవలయం

అనువాదం: "ప్రద్యుమ్న"

## 24. పదివేలపౌనుల బహుమతి

"అరుణవలయం అనబడే హంతకుల ముఠాకు చెందిన ముఖ్యవ్యక్తిని అరెస్టు చేయడానికి సాయపడే సమాచారం తెలియజేసినవారికి అసోసియేటెడ్ మర్చంట్స్ బ్యాంకివారు పదివేల పౌనుల బహుమతి ఇవ్వడానికి అనుమతి పొందారు. ముఠా సభ్యుడెవడైనా అరుణవలయం నాయకుణ్ణి, లేక నాయకురాల్ని అరెస్టు చేయడానికి వీలైన ధోగలా ఇవ్వగలిగిన పక్షంలో, ఆ సభ్యునిపై హత్యానేరం లేకపోతే, అతడికి క్షమాభిక్ష ఇవ్వగలమని కూడా ప్రభుత్వం వాగ్దానం చేస్తోంది"

ప్రతి పోస్టాఫీసు కిటికీవద్ద, ప్రతి పోలీసు స్టేషనువద్ద ఈ ప్రకటన ఎర్రని అచ్చులో కనబడుతోంది.

ఆఫీసుకు వెడుతూ డిటెక్టివ్ డెరిక్ యేల్ ఈ ప్రకటన చదివాడు. తాను వేటాడుతున్న అరుణవలయం ముఠాలోని సభ్యులపై ఈ ప్రకటన ప్రభావం ఎలా ఉంటుందో అని అతడు ఆలోచించసాగాడు.

తాలియా డ్రమ్మండ్ బస్సులో వెడుతూ ఈ ప్రకటన చదివింది. ఆమెలో ఆమే చిరునవ్వు నవ్వుకుంది. కాని అందరికంటె ఎక్కువగా హార్వే ఫ్రాయంట్‌ను ఈ ప్రకటన బాగా ఆకర్షించింది. పాలిపోయిన అతని ముఖంలోకి, కళ్ళలోకి కళా, కాంతి వచ్చాయి. అతడు ఆఫీసుకి వెడుతూ ఈ ప్రకటన చూశాడు. వెంటనే ఆఫీసుకి వెళ్ళడం మానేసి, ఇంటికి తిరిగిపోయాడు. డ్రాయరు తెరిచి అరుణవలయంవారు తీసుకుపోయిన బ్యాంకి నోట్ల నంబర్ల జాబితా మళ్ళీ చదువుకున్నాడు. చాలా కష్టపడి, ఎంతో శ్రమతో ఆ నంబర్ల జాబితా తయారు చేశాడు.

ఇప్పుడు మళ్ళీ ఆ జాబితాకు ఇంకొక నకలు తయారుచేశాడు. నకలు వ్రాయడానికి చాలసేపు పట్టింది. అది అయిన తరువాత ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరమూ, నంబర్ల జాబితా నకలూ ఒక కవర్లో పెట్టి, పోయిన వస్తువులను వెదికి పెట్టే లాయర్ల కంపెనీ ఒకదానికి పోస్టుచేశాడు.

ఆ కంపెనీ పేరు హెగిట్స్ కంపెనీ. ఈ కంపెనీవారు ఫ్రాయంట్‌కు ఇదివరలో చాలా సహాయంచేసి ఉన్నారు. మరునాడు ఉదయం ఆ కంపెనీనుండి జేమ్స్ హెగిట్ అనే ఆయన ఫ్రాయంట్ వద్దకు వచ్చాడు.

హెగిట్స్ కంపెనీ పేరు అంతగా గౌరవించబడే పేరు కాదు. లాయర్లు కూడా తమలో తాము ఆ కంపెనీనిగూర్చి మంచిగా మాట్లాడుకునే వారు కాదు. అయినా అది లండనులో బాగా అభివృద్ధిలో ఉన్న లాయర్ల కంపెనీలలో ఒకటి. ఆ కంపెనీ సలహాకువచ్చే వ్యక్తులు దుర్జనులా సజ్జనులా అని సందేహం కలిగించే జాతికి చెందినవాళ్ళు. కాని సాధారణ పౌరులకు కూడా ఆ కంపెనీ చాలా సహాయపడేది. అపహరింపబడిన వస్తువులను వెదికి ఇవ్వడంలో కంపెనీకి మంచిపేరున్నది. ఎలా పట్టేవారో గాని, పోయిన వస్తువులను గూర్చి విన్న ఏ "పెద్దమనిషి"నో ఆ కంపెనీవారు చటుక్కున పట్టేసేవారు. సాధారణంగా పోయినవస్తువు దొరికేదాకా వదిలి పెట్టేవారు కాదు.

"మిస్టర్ ఫ్రాయంట్! మీ ఉత్తరం అందింది" అన్నాడు లాయరు హెగిట్. "మీ నోట్లలో ఏ ఒక్కటీ మా మామూలు మార్గాలలో చెలామణీ అయ్యేట్లు కనిపించడం లేదు. మీ నోట్లను చెలామణీలోకి పంపించే వ్యక్తి ఎవరయ్యాడో తెలియదు గనుక అతని పేరు బయట పెట్టడంలో తప్పేమీ లేదనుకుంటాను."

"ఎలా తెలుసు?" అని ఫ్రాయంట్ అడిగాడు.

"బ్రబజాన్!"

"ఎవరు, బ్రబజాన్స్ బ్యాంకి తాలూకు బ్రబజానేనా?"

"అవును, అతడే దొంగ వ్యాపారంలో అతన్ని మించిన దిట్ట లండనులో లేడు. అతని బ్యాంకిద్వారా దొంగలధనం ఎంత చెలామణీ అయినా ఎవరూ కనిపెట్టలేక పోయారు. అతడు విదేశాలతో కూడా వ్యాపారం చేస్తూ, ఆ ప్రమాణం డబ్బు మార్చి, మళ్ళీ మార్చి ఎగుమతి చేసే పాడు అతినిపుణంగా చేస్తున్నాడని మాకు తెలుసు. తెలుసునంటే తెలుసునని కాదు," అని తనమాట తానే సవరించుకుంటూ "మాకు గట్టి అనుమానం మాత్రమే ఉన్నది అధికారులకు ఆ విషయం తెలియజెయ్యవలసిన బాధ్యత మామీద ఉన్నది కాని, మాకు మాత్రంగా తెలియకపోవడంచేత ఊరుకున్నాము మీనోటును ఆరాతీసి పట్టుకోవడం కష్టమైన పని. అదిమీకు చెప్పబోవడానికే నేను వచ్చాను. దొంగిలింపబడిన నోట్లు ఎక్కువగా పుర్రపు పందాలవద్ద చెలామణీ అవుతాయి. కాని విదేశాలకు కూడా చాలావరకూ వెడతాయి అక్కడ వాటిని మార్చడం అంతకష్టంకాదు గాని పట్టుకోవడం మాత్రం కష్టం. అరుణవలయం ముఠావారు దొంగిలించారని కదూ మీరన్నది?" అన్నాడు లాయరు.

"వారిని మీరెరుగుదురా?" ఫ్రాయంట్ తొందరగా అడిగాడు.

"వారితో మాకెప్పుడూ పనితగలలేదు" అని సమాధాన మిచ్చాడు హెగిట్. "కాక పోతే వాళ్ళనిగూర్చి నాకు తెలుసు. భలే మోసగాళ్ళు తెలిసో తెలియకో బ్రబజాన్ వాళ్ళపనులు చేసిపెడుతూంటాడు వాడు. ఇప్పటికి మాయమైపోయాడు గనుక అరుణవలయంవారు మీనోటును త్వరగా మార్చలేరు. బ్యాంకినోట్లను మార్చడం అంత సులభం కాదు. ఒకవేళ మేము మీనోట్లను పట్టుకుని, అవి ఎవరివద్దనుండి వెలువడినాయో కనుక్కో గలిగితే ఏం చెయ్యమంటారు?"

"వెంటనే మాకునాకు తెలియజెయ్యాలి

ఇంకెవరికీ చెప్పకూడదు. దీనిమీద నా ప్రాణాలాధారపడి ఉన్నాయి. నేను పోయిన ధనం రాబట్టుకోడానికి ప్రయత్నిస్తున్నానని అరుణవలయానికి తెలిస్తే నాకు చాలా ప్రమాదం.”

లాయరు అంగీకరించాడు.

అరుణవలయంపై లాయరుకు ఏదో కుతూహలం కలిగినట్లుంది. ఫ్రాయంట్ కు తెలియకుండానే అతనివద్దనుండి సమాచారం లాగడానికి ప్రయత్నించాడు.

“వీళ్లు కొత్తరకం నేరస్థుల్లాగా ఉన్నారు. ఇటలీలో ‘కాళహా సం’ అని ఒక దొంగల ముఠా ఉన్నది. వాళ్ళు బెదిరించి డబ్బు లాగుతారు, ఇవ్వకపోతే హత్య చేస్తారు. అది అక్కడ సర్వసాధారణమైన విషయం. కాని ఈ దేశంలో కూడా అలాంటిది జరగడం విచిత్రమే. అన్నిటికంటే, అరుణవలయం భిన్నం కాకుండా కట్టుదిట్టంగా నడవడమే విచిత్రమైనది. అసలు నా ఉద్దేశం, ఈ అరుణవలయం అనేది ముఠా కాదనీ, ఒకడే వ్యక్తి ఉండి, అనేకులు మనుషులను నియోగించి పని చేయిస్తున్నాడని, ఆ మనుషులు ఒకరినొకరుగాని, తమ యజమానిని గాని ఎరగరనీ. లేకపోతే ఆ యజమానిని ఈపాటికి ఎవడో బయటపెట్టేఉండేవాడు. అసలు వ్యక్తిని ఎవరూ ఎరగకపోవడం మూలానే వాడు ఇంతకాలం నెగ్గుకొస్తున్నాడు.”

లాయరు జేమ్స్ హెగిట్ ప్రసంగం ముగించి టోపీతీసుకుని వెళ్లడానికి లేచాడు.

“అన్నట్లు, మీకు ఫెలిక్స్ మార్ల్ తెలుసా? మాకు తెలిసిన ఒకమనిషి మార్ల్ యింటిలో దొంగతనానికి జొరబడ్డాడని నిర్బంధింప బడ్డాడు. ఆ మనిషి పేరు బార్నెట్ మీ కెరగరనుకుంటాను,” అన్నాడు హెగిట్.

ఫ్రాయంట్ కు బార్నెట్ ఎవడో తెలియదు. మార్ల్ తెలుసు. అరుణవలయం మీద హెగిట్ కు కలిగినంత ఆసక్తి ఫ్రాయంట్ కు మార్ల్ మీద కలిగింది.

“నాకు మార్ల్ తెలుసు. దేనికి?”

లాయరు నవ్వాడు.

“చిత్రమైన మనిషి. ఫ్రెంచి బ్యాంకులలో దొంగతనాలు జరిపిన ముఠాలో సభ్యుడు. మీకది తెలియదనుకుంటాను. మార్ తరఫు లాయరు ఇవ్వాళ నన్ను చూడడానికి వచ్చాడు. మార్ల్ భార్యనని చెబుతూ ఒక స్త్రీ తయారయిందట. మార్ ఆస్తికి తను రావాలని ఆమె అంటోందట. ఆమె మార్ల్ కథ యావత్తూ చెప్పింది. మార్, లైట్‌మన్ అనే మరొక వ్యక్తితో కలిసి ఫ్రాన్సులో బోలెడు ధనం సంపాదించారట. చివరికి పట్టుబడ్డారట. మార్ కు మరణ దండన పడేదేనట, గాని ప్రభుత్వం తరఫున

సాక్ష్యం చెప్పాడట. లైట్‌మన్ బహుశా 'గిలటిన్' యంత్రానికి ఎర అయి ఉంటాడు."

"ఆహా, మార్ల్ ఎంత మంచివాడు!" అని ఫ్రాయంట్ హేళనగా అన్నాడు.

"మన జీవిత రహస్యాలన్నీ బట్టబయలు చేస్తే మనమూ మంచివాళ్లం లాగానే ఉంటాము. మనమేనా తక్కువ తిన్నది?" అని హెగిట్ కూడా వ్యంగ్యంగానే అన్నాడు. ఫ్రాయంట్‌కు ఆ వ్యంగ్యం చురుక్కున తగిలింది. తన జీవితం తెరిచిన పుస్తకంలాంటిదని అతడు చెప్పుకుంటాడు. బహుశా బ్యాంకి బుక్కు లాంటిదై ఉంటుంది.

బ్రబజాన్ దొంగసొమ్ముతో వ్యాపారం చేసేవాడన్న మాట! మార్ల్ హంతకుడన్న మాట! మార్ల్ జైలునుంచి ఎలా తప్పించుకుని వచ్చాడో ఫ్రాయంట్ ఊహకి అందలేదు. ఏమైనా, చనిపోయిన మార్ల్‌తో తన వ్యాపార సంబంధాలు మరీ ప్రమాదాలకు దారితీయనందుకు సంతోషించాడు.

ఫ్రాయంట్ కారెక్కి తను మామూలుగా భోజనం చేసే క్లబ్బుకి బయలుదేరాడు. దారిలో ఒకచోట విద్యుద్దీప కాంతిలో మెరుస్తూ ఎర్ర అక్షరాల ప్రకటన కనిపించింది. అది చూడగానే తనకి నిష్కారణంగా యాభై వేల పౌనులు నష్టమయ్యాయి కదా అని మళ్లీ విచారం కలిగింది.

"పదివేలు బహుమతీ!" అని అస్పష్టంగా తనలో తాను గొణుక్కున్నాడు. "ఎవడు పట్టుకోగలడు? ఎవడు వచ్చి సమాచారం చెబుతాడు? ఆఖరికి బ్రబజాన్ కూడా సాహసించి సాక్ష్యం చెప్పలేదు," అనుకున్నాడు.

కాని బ్రబజాన్ సంగతి ఫ్రాయంట్ కేం తెలుసు?

## 25. బ్రబజాన్

బియర్డ్ మోర్ ఎస్టేటులో పాడుబడిన చిన్న ఇంటిలో పైఅంతస్తులో బ్రబజాన్ కూర్చుని ఉన్నాడు. చలికి వణుకుతూ, రొట్టె తింటున్నాడు. హెచ్చరిక అందీ, తన ఇంటినుంచి పారిపోయి వచ్చినప్పుడు ఏదుస్తులతో ఉన్నాడో ఆదుస్తులతోనే ఇంకా ఉన్నాడు. అవి మాసిపోయి అసహ్యంగా ఉన్నాయి. తెల్లని చొక్కా దుమ్ముకొట్టుకుని జేగురురంగుకి తిరిగింది. గడ్డం కూడా మాసింది.

ఒండికొచ్చి, జాగ్రత్తగా కిటికీ తెరిచాడు. రొట్టెలో మిగిలిన ముక్కలు బయట పారవేశాడు. మెల్లగా దిగి, కిందికిపోయి వంటగదిలోకి వెళ్ళాడు. అతనివద్ద సబ్బుగాని, తువ్వాలుగాని లేదు. పారిపోయేటప్పుడు తెచ్చిన రెండు జేబురుమాళ్లతోనే ముఖం కడుక్కుని తుడుచుకున్నాడు. తొడుక్కున్న బట్టలు, ఒక ఓవరుకోటు, ఒక టోపీ తప్ప అతనివద్ద మరేమీ లేవు.

అతడు పారిపోయి వచ్చిన తరువాతి రాత్రి అజ్ఞాతవ్యక్తి తెచ్చిఇచ్చిన తినుబండారాలు అఖరైపోయాయి. దాదాపు ఇరవై నాలుగు గంటలసేపు తిండీతిప్పలు లేకుండా ఉన్నా, అప్పటి భయాందోళనలో అతనికి ఆకలి అనిపించలేదు. అజ్ఞాతవ్యక్తి తినుబండారాలు తేగానే అప్పుడు ఆకలైంది. ఒకవారం రోజులపాటు ఆ శిథిల గృహంలో ఒంటరిగా, పోలీసులు తనకోసం గాలిస్తున్నారనే భయంతో, పట్టుబడితే దీర్ఘ కారాగారవాసం తప్పదనే నిరాశతో అతనిమనస్సు ఎంత చెదిరిపోయిందో, రూపం కూడా అంత వికృతంగా తయారైంది.

డిటెక్టివ్ యేల్ పైఅంతస్తులో వెదకడానికి వచ్చినప్పుడు బ్రబజాన్ ఒకతలుపు మూల ముడుచుకుని దాక్కుని కూర్చున్నాడు. డెరిక్ యేల్ జ్ఞాపకం రాగానే భయంతో నిలువునా కంపించాడు.

ఈ ఇంట్లో మరో రాత్రి గడపాలి. దగ్గరలో కనిపించిన ఒక పాతకుర్చీలో కూలబడి కూర్చున్నాడు. తనకు హెచ్చరిక అందచేసిన అజ్ఞాతవ్యక్తి రావలసిన సమయం ఆసన్నమైంది. అతడువస్తే మరికొంత ఆహారం తీసుకువస్తాడు. ఇలా ఆలోచిస్తూ బ్రబజాన్ కునికిపాట్లు పడసాగాడు. ఇంతలో తలుపులో తాళంపెట్టిన చప్పుడు వినిపించింది. అదిరిపడిలేచాడు. తను ఉన్న గది తలుపువద్దకు వెళ్ళి మెల్లిగా తెరిచాడు. ఒక నూతనవ్యక్తి కంఠస్వరం వినిపించింది. ఆకంఠధ్వని ప్రతిధ్వనివలె ఉందిగాని అసలు ధ్వనిలాగ లేదు.

"కిందికిరా" అన్నదా కంఠం.

నడవలో చీకటి దట్టంగా ఉంది. చీకట్లోనే తడుముకుంటూ బ్రబజాన్ మెట్లు దిగి వెళ్లాడు.

"అక్కడే వుండు" అన్నది కంఠం. "నీకు ఆహారం, దుస్తులు తెచ్చాను నీకొక్కవలసిన అన్నీ తెచ్చాను. గడ్డం గీసుకుని కొస్త శుభ్రంగా తయారవు"

"నేనెక్కడికి వెళ్లాలి?" బ్రబజాన్ అడిగాడు.

"రేపు విక్టోరియా రేవునుంచి న్యూజీలాండ్‌కు వెళ్ళే స్టీమరులో నీకొక టికెట్ తీసుకున్నాను. పాస్‌పోర్టు కాగితాలు, టికెట్ ఈ సూట్‌కేసులో ఉన్నాయి. నీ మీసాలు మాత్రం ఉంచి, కనుబొమలు తీసెయ్యి. నీ ముఖంలో ముందు కొట్టవచ్చేట్లు కనిపించేవి నీ కనుబొమలే."

ఈ అజ్ఞాత వ్యక్తి తనని ఎప్పుడు చూసి ఉంటాడా అని బ్రబజాన్ ఆశ్చర్యపోయాడు. అప్రయత్నంగా దట్టమైన తన కనుబొమలు తడుముకుని నిజమే అనుకున్నాడు.

"నీకు నేను డబ్బేమీ తీసుకురాలేదు. మార్ల్ దగ్గరనుంచి నువ్వు దొంగిలించిన డబ్బు నీ దగ్గరే ఉంది. నువ్వు అతని ఖాతా రద్దు చేస్తూ చెక్కు మీద అతని సంతకం నువ్వే ఫోర్జరీ చేసి డబ్బు తీసుకున్నావు. నేనతన్ని ఎలాగూ అఖరుచేస్తానని అనుకున్నావు. అఖరుచేశాననుకో..." అని ఆగింది కంఠం.

"ఎవరునువ్వు?" బ్రబజాన్ అడిగాడు.

"అరుణవలయాన్ని" అని సమాధానం. "ఎందుకడుగుతావు? నువ్వు నన్నిదివరకు కలుసుకున్నావుగా?"

"అవును; కాని ఈ ప్రదేశం నాకు దుర్భరంగా ఉంది. నేనెప్పుడు వెళ్ళిపోవచ్చు?"

"రేపు రేపు రాత్రివరకూ ఆగు. స్టీమరు ఆ మర్నాడుదయం బయలుదేరుతుంది నువ్వు మాత్రం రేపు రాత్రికే స్టీమరు ఎక్కు."

"కాని నాకవద్ద పోలీసులు నాకోసం కాపలా కాస్తారేమో! ప్రమాదం కాదా?"

"నీకేం ప్రమాదంలేదు." అని "నీవద్ద డబ్బు ఇలాగివ్వు" అని కంఠం అడిగింది.

"నావద్ద డబ్బా" అని బ్యాంకర్ అదిరిపడ్డాడు.

"ముందు ఇలాగిచ్చెయ్యి" చీకట్లోంచి వెలువడుతున్న ఆ కంఠధ్వని భయంకర గర్జనంలాగ ఉన్నది. వణికిపోతూ బ్రబజాన్ డబ్బు తీసిఇచ్చాడు.

"ఇది తీసుకో" అని అజ్ఞాతవ్యక్తి ఏదో అందించాడు. బ్రబజాన్ ఒక చిన్న కవరు పుచ్చుకున్నాడు. అలవాటైన చేతులు కనుక అతడు అవి కొత్తనోట్లని గ్రహించాడు.

"నువ్వు విదేశాలలో ఆ నోట్లు మార్చవచ్చు."

"ఈ రాత్రే నేను వెళ్లిపోకూడదా? ఇక్కడ నాకు చాలా భయంగాఉంది" బ్రబజాన్ పళ్లు భయంతో గజగజ కొట్టుకున్నాయి.

అరుణవలయ వ్యక్తి కొంతసేపు ఆలోచించి "నీ ఇష్టం. కాని ప్రమాదంలో అడుగు పెట్టడమవుతుంది. సరే. ఇక పైకి వెళ్లిపో, అన్నాడు.

కఠినమైన ఈ ఆజ్ఞను బ్రబజాన్ వెంటనే పాటించాడు.

తలుపు మూయడం బ్రబజాన్‌కు వినిపించింది. కిటికీగాజుతలుపులలోంచి చూశాడు. నల్లని నీడలాంటి మానవాకృతి కదిలిపోతూ దూరాన చీకటిలో కలిసి

పోయింది. గేటుకూడా మూసుకుంది. అరుణనిలయ వ్యక్తి వెళ్ళిపోయాడు.

బ్రబజాన్ సూట్‌కేసు పట్టుకుని వంటగదిలోకి వెళ్లాడు. అతడు ఇదివరకే ఇల్లంతా వెదకడం ఒక చిన్న కొవ్వొత్తి ముక్క కనిపించింది. వంటగదిలోంచి వెలుతురు బయటకు కనబడదు గనుక నిర్భయంగా కొవ్వొత్తి వెలిగించాడు.

సూట్‌కేసులో అజ్ఞాతవ్యక్తి చెప్పినట్టు నిజంగానే అతనికి కావలసిన సరంజామా అంతా ఉంది. అవన్నీ అలాఉంచి, కొత్తవాడు తనచేతిలో పెట్టిన నోట్లను ముందు పరిశీలించాడు. నోట్లు ఒకవరసలో, ఒక సంఖ్యాక్రమంలో లేవు. అయినా అవన్నీ కొత్తనోట్లే. తా నిచ్చిన నోట్లన్నీ ఒకే వరసలోవి. సాధారణంగా బ్యాంకినోట్లు కొత్తవైనట్లయితే అన్నీ ఒక వరుసలో ఉంటాయి. రకరకాల సంఖ్యలలో ఉండవు. హఠాత్తుగా దానికి కారణం అతనికి స్ఫురించింది. అరుణనిలయం వారు ఎవరినో బెదిరించి ఈ డబ్బు లాగివుంటారు. ఆ నోట్ల సంఖ్యలు ఒకే వరుసలో ఉండకూడదని ముందే ఆజ్ఞాపించి ఉంటారు. డబ్బు క్రింద పెట్టి బ్రబజాన్ దుస్తులు మార్చుకోసాగాడు.

ఒక గంట తరవాత బ్రబజాన్ చక్కని దుస్తులు ధరించి నీటుగా బయటపడ్డాడు. కనుబొమలతో తీసివెయ్యడం అతని రూపురేఖలు మారిపోయాయి. ఆ రాత్రి పదకొండు గంటలకి అతడు రోడ్డున పోతూంటే, అతని కోసం గాలిస్తున్న అనేకమంది డిటెక్టివులలో ఒకడు ఎదురుపడికూడా గుర్తుపట్టలేకపోయాడు.

యూస్టన్ స్టేషను సమీపంలో ఒక చిన్న హోటలులో ఒకగది అద్దెకు తీసుకున్నాడు. అలసి అలసి ఉండడంచేత నిద్రపోయాడు. ఒక వారంరోజుల తరవాత మొదటిసారిగా హాయిగా నిద్ర పట్టింది.

మరునాడు గదిలోనే గడిపాడు. పగటిపూట బయటికి వెళ్ళడానికి భయపడ్డాడు. సాయంత్రం తనగదిలోనే భోజనం చేసి షికారుకి బయటికి వచ్చాడు. కొద్దికొద్దిగా ధైర్యం చేకూరింది. పాకవద్ద డిటెక్టివ్ కళ్ళలో కారం కొట్టి తప్పించుకోవడం తేలికే అనే నమ్మకం కలిగింది. జనసంచారం తక్కువగా ఉన్న వీథులలో తిరిగాడు. మ్యూజియం దగ్గర తిరుగాడుతుండగా కొత్తగా అంటించిన ప్రకటన కనబడింది. ఆగి అది చదివాడు.

చదువుతూండగా ఒక ఆలోచన కలిగింది. పదివేల పౌనుల బహుమతీ, స్వేచ్ఛ రెండూ కలిసివస్తాయి! మర్నాడుదయం నౌకలో తప్పించుకోవడం నిజానికంత సులభంగా తేలదు. పట్టుకుంటే తనగతి ఏమవు








#  అరుణవలయం 

తుంది పట్టుబడక పోయినా, నిరంతర భీతితో తిరుగుతూ ఉండడమే గా తనగతి! పదివేల పౌనులు, స్వేచ్ఛ! అంతేకాదు, తాను ఫెలిక్స్ మూర్ ఎస్టేటునుంచి మాయ చేసి లాగిన ధనం సంగతి ఎవరికీ తెలియదు రేపుదయం ఆ ధనం ఎక్కడున్నా జాగ్రత్తగా దాచి, పోలీసు ప్రధాన కార్యాలయానికి వెడతాడు వెళ్ళి తనకు తెలిసిన సమాచారం అంతా చెప్పేస్తాడు బహుశా ఆ సమాచారము అరుణ వలయాన్ని బంధించడానికి తోడ్పడవచ్చు

"చెప్పి తీర్తాను" అని బిగ్గరగా అనుకున్నాడు

"తెలివైన పని చేస్తున్నావు" అతని వెనుక నుండి ఈ మాటలు వినిపించాయి. వెంటనే గిరుక్కున వెనక్కి తిరిగాడు.

పొట్టిగా, లావుగా ఉన్న మనిషొకడు పిల్లిలాగ మెల్లిగా నిశ్శబ్దంగా వచ్చి అతని వెనుక నుంచుని ఉన్నాడు. బ్రబజాన్ అతన్ని గుర్తుపట్టాడు

"ఇన్‌స్పెక్టర్ పార్!" అని ఆశ్చర్యపోయాడు

"అవును, నేనే, మిస్టర్ బ్రబజాన్! సరదాగా అలా వెడదాం వస్తావా? లేకపోతే ఇబ్బంది పెట్టదలుచుకున్నావా?"

ఇద్దరూ పోలీసు స్టేషనుకు వెళ్ళారు వారు లోపలికి వెడుతుంటే, లోపలనుంచి ఒక యువతి బయటికొచ్చింది తన వద్ద పూర్వం పనిచేసిన ఆ యువతిని బ్రబజాన్ గుర్తుపట్టలేక పోయాడు

"మిస్టర్ బ్రబజాన్! ఉన్నదున్నట్టు నిజం చెప్పేస్తే నీకూ కష్టం ఉండదు, మాకూ కష్టం ఉండదు. నువ్వెక్కడున్నావో నాకు తెలుసు యూస్టన్ రోడ్డులో బ్రైటన్ హోటల్‌లో ఉంటున్నావు గత రాత్రే అక్కడికి వచ్చావు థామ్సన్ అనే పేరు పెట్టుకుని విక్టోరియా రేవునుండి రేపు న్యూజిలాండ్ బయలుదేరబోయే నౌకలో టికెట్ కొన్నావు"

ఇదంతా విని బ్రబజాన్ విభ్రాంతి పొందాడు "ఇది మీకెలా తెలిసింది?" అని అడిగాడు

పార్ సమాధానం చెప్పలేదు. బ్రబజాన్ అబద్ధం చెప్పదలుచుకోలేదు తనకు తెలిసి

సంగతివరకూ చెప్పేశాడు. టెలిఫోనులో తనకు హెచ్చరిక అందినప్పటినుంచీ, అరెస్టు అయేవరకూ అంతా చెప్పాడు.

"అయితే మేము వెదుకుతున్నంతసేపూ ఆ పాడుపడ్డ ఇంట్లోనే ఉన్నావన్నమాట? డెరిక్ రోయల్ కూడా కనబడకుండా ఎలా దాక్కున్నావు?" అడిగాడు పార్.

"ఓ, పై అంతస్తులోకి వచ్చి వెదికింది అతడా? మీరనుకున్నాను. లోపల మరొకగది ఉన్నది. సామాను గది అనుకుంటాను. ఆ గదిలో తలుపు చాటున నక్కాను. రోయల్ తలుపుదాకా వచ్చాడు. నేను భయంతో హడిలి చచ్చాను."

"నువ్వక్కడ దాక్కుని ఉండవచ్చునని రోయల్ చెప్పినది నిజమే నన్నమాట. సరే ఇప్పుడేం చేద్దామనుకుంటున్నావు?"

"అరుణ వలయాన్ని గూర్చి నాకు తెలిసినంతవరకూ చెబుతాను. మీరు అసలు వాణ్ణి పట్టుకోడానికి నేను చెప్పేది పనికిరావచ్చు. కాని మీరు హుషారుగా పనిచెయ్యాలి నాదగ్గరనోట్లుతీసుకుని,అతనినోట్లునాకిచ్చాడని చెప్పానుగదూ? తనవద్దనోట్ల నంబర్లను బట్టి తను పట్టుబడి పోతానని భయపడి అలా మార్చాడనుకుంటాను. కాని నాదగ్గరనుంచి తీసుకున్ననోట్ల నంబర్లు వరుసక్రమంలో ఉన్నాయి ఇ. 19 క్రమంలో ఉన్నాయి వాటిలో ప్రతి ఒక్కనోటు నంబరు నేను చెప్పగలను."

"అయితే హంతకుడు నీకిచ్చిన నోటు ఫ్రాయంట్‌వై యుండాలి," అన్నాడు పార్.

"ఆ నోట్లు అతడు మార్చడానికి క్షేమంలేక నా నోట్లు తీసుకున్నాడు. నా నోట్లు అతడు మారుస్తాడు. అది మీకు మంచి అవకాశం."

ఇన్‌స్పెక్టర్ ఈమాటల నంతగా పట్టించుకోలేదు. బ్రబజాన్‌ను ఖైదులో పెట్టారు. తరవాత పార్ ఫ్రాయంట్‌ను ఫోనులో పిలిచాడు. పోయిన నోట్లవర్తమానం చెప్పదగినంత వరకూ చెప్పాడు.

"అయితే మీకు నా డబ్బు దొరికిందన్నమాట. వెంటనే మా ఇంటికి బయలుదేరి రండి," అన్నాడు ఫ్రాయంట్.

"మీ ఇంటికి వస్తాను. కాని ఒకసంగతి చెప్పాలి. ఇప్పుడిది మీ డబ్బుకాదు. ఈ నోట్లు మీరు అరుణవలయానికి అందజేసినవే అయినా, ఇప్పుడివి మీవికాదు."

తరవాత పార్ ఫ్రాయంట్ ఇంటికి వెళ్లి వివరంగా చెప్పాడు. ఫ్రాయంట్ నిరాశపడ్డాడు. డబ్బు ఎవరిదగ్గర దొరికితేనేం, అది తనదే నని అతని భావం. పార్ కొంతసేపు మాట్లాడిన పిదప ఫ్రాయంట్‌కు నచ్చచెప్పగలిగాడు. తరవాత ఫ్రాయంట్ హఠాత్తుగా ఇలా ప్రశ్నించాడు.

"బ్రబజాన్ ఆ అజ్ఞాత వ్యక్తి కిచ్చిన నోట్ల నంబర్లు మీ దగ్గర ఉన్నాయా?"

"ఆ, అవి తేలికగా జ్ఞాపకం ఉంటాయి, ఒక వరసలో ఉన్నాయి గనక," అని పార్ నోట్ల నంబర్లు చెప్పాడు. ఫ్రాయంట్ నోటు బుక్కులో నంబర్లన్నీ వ్రాసుకున్నాడు.

(ఇంకా ఉంది)




ద్వితీయ పంచవర్ష ప్రణాళిక :

# ఆంధ్రరాష్ట్రంలో మహిళా సంక్షేమం

### పి. భానుమతి

శాస్త్రీయము, ఆచరణీయము అయిన పద్ధతులలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తయారైంది. దీనికి ప్రాతిపదిక గ్రామము భారీ పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, మత్స్య తరగతి పరిశ్రమలు విరివిగా ప్రభుత్వ పరంగాను, ప్రజా పరంగాను స్థాపించడం, నిరుద్యోగ నివారణ ఇత్యాది ప్రధాన విషయములలో మహత్తర ఫలితాల్ని సాధించడం ప్రణాళికా లక్ష్యాలు. తద్వారా ప్రధాని నెహ్రూ ఉద్ఘాటిస్తూ వచ్చిన సోషలిస్టు సమాజ స్థాపన అనేదికూడా ప్రధానంగా లక్ష్యభూతమై ఉన్నది. పారిశ్రామిక, సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో నేకాక ప్రత్యేకంగా గ్రామీణ ప్రజా జీవన సర్వతోముఖాభివృద్ధికి కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ విస్తరణ కేంద్రములు, గ్రామీణ ప్రజా ప్రణాళికలు, మహిళా సంక్షేమ కేంద్రములు, శాఖలు ఇత్యాది అభ్యుదయకర విధానములు బహుళముగా అమలు చేయడానికి నిశ్చయించబడినది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలములో ఆంధ్రరాష్ట్రము లక్షించిన మహిళా సంక్షేమ కార్యకలాపములు, అందులకు కేటాయించిన మొత్తములు మొదలైన విషయములన్నీ ఆంధ్ర స్త్రీలు తెలుసుకొని తమ ఉత్సాహ శక్తులను అటువైపు మళ్లించుట ఎంతైనా అవసరము.

మహిళా సంక్షేమము ప్రధానముగా స్త్రీలు, పిల్లలు, అనాథలు మొదలయినవారి ఆర్థిక, సాంఘిక పరిస్థితులను అభివృద్ధి చేయడానికి ఉద్దేశించబడినది. ప్రస్తుతము ఆంధ్రరాష్ట్రములోని 11 జిల్లాలలో ను 7 గురు అసిస్టెంటు ఉమన్ వెల్ఫేర్ ఆఫీసర్లు ఉన్నారు. 50 మహిళా సంక్షేమ శాఖలు (Women's welfare Branches) మాత్రమే ఉన్నాయి. అందులో 6 శాఖలు ఏజన్సీ ప్రాంతములో నున్నవి. వాటి ప్రధాన కార్యక్రమము—హరిజనులు బీదలు నివసించు గూడెములకు వెళ్లి వారికి గృహాలంకరణ, వ్యష్టి సమష్టి ఆరోగ్య విధానములు, శిశు పోషణ యిత్యాది విషయములను గూర్చి బోధించడం వారికి చేతి పనులు, కుట్లు, అల్లికలు మొదలైనవి నేర్పి వారి ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, సాంకేతిక జీవితమును విస్తృతపరచుటకు ప్రయత్నిస్తారు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో మహిళా సంక్షేమము చేర్చబడలేదు. ద్వితీయ ప్రణాళికలో 30 మంది మహిళా సంక్షేమ కార్యకర్తలతో (Women's welfare organisers), రెండు రక్షణగృహములు, ఆశ్రయ శిబిరములు (Rescue Homes and shelter camps) ప్రారంభించి 840 మంది మహిళలకు ప్రయోజనము కల్పించడం, 8 సేవా సదనములు (Service Homes) స్థాపించి



1350 మంది అనాథ స్త్రీలకు, 540 మంది అనాథశిశువులకు ప్రయోజనం కల్పించడం ఉద్దేశించబడినది.
పునరావాస కార్యక్రమము క్రింద 600 మంది మహిళలకు సహాయం కలుగచేయడానికికూడ ఉద్దేశించబడినది.

35 లక్షల రూపాయల వ్యయముతో ఈ క్రింది కార్యక్రమములు కొనసాగించుటకు ద్వితీయ ప్రణాళికలో తలపెట్టబడినది.

| | | |
|---|---|---|
| 1. | శిక్షణ | రు. 1.90 లక్షలు |
| 2. | రక్షణ గృహములు, ఆశ్రయ శిబిరములు | 5.70 |
| 3 | సేవా సదనములు | 16.38 |
| 4. | పునరావాసము | 3.00 |
| 5. | ప్రస్తుతమున్న శాఖలను ప్రత్యేకముగా అభివృద్ధిపరచుట | 4.00 |
| 6 | పరిపాలనా వ్యవస్థను విస్తృతము చేయుట | 4.02 |
| | మొత్తము | 35.00 |

1 శిక్షణ: 30 మంది మహిళా సంక్షేమ కార్యకర్తల్ని తరిఫీదు చేయడానికి ఒక శిక్షణాలయము స్థాపిస్తారు. ఇదికాక ప్రస్తుతము మహిళా సంక్షేమ రంగాలలో పనిచేస్తున్న 20 మంది కార్యకర్తలకు 20 మంది మంత్రసానుల చొప్పున పునశ్చరణ తరగతులు (Refresher courses) ప్రతి ఏడూ ఏర్పాటు చేస్తారు.

పై వారిలో కొంతమందిని ఏరి ఇతర రాష్ట్రాలకు, విదేశాలకు ప్రత్యేక శిక్షణ నిమిత్తము పంపిస్తారు.

2. రక్షణ గృహాలు: పరిస్థితుల ప్రాబల్యము వలన విధిలేక, సకాలములో రక్షణలేక సంఘములో చెదిరిపోయిన స్త్రీలు, బాలికలు సాధారణముగా సంఘములో దుష్టశక్తులకు బలియైపోవడం కనుపిస్తున్నది. మద్రాసు వ్యభిచార నిర్మూలన చట్టం (1930) క్రిందకు రాని స్త్రీలు, బాలికలు యిట్టి గృహాలలో చేర్చుకొనబడతారు. పైన పేర్కొన్న చట్టము అవినీతికి పాల్పడిన వారి కోసం చేయబడినది. అవినీతికి పాల్పడకుండా, వ్యక్తిపై నిర్మల జీవితమును గడుపుదామనుకొనే అనాథ స్త్రీలను, బాలికలను ప్రభుత్వము ఈ విధముగా ఉభయ ప్రదానము చేసి, రక్షణగృహాలలో చేర్చుకొని సముద్ధరిస్తూంది. చేర్చుకొనేముందు వారిగత జీవితములను గూర్చి కార్యకర్తలు విచారించి తెలుసుకొంటారు. అర్హతగలవారికి సత్వర సహాయము లభిస్తుంది. వారు నిలయములలో ఉండగల కాలముయొక్క గడువు 3 సం॥లకు పరిమితము చేయబడినది. వారికి ఏదైన ఆధారము, యితర సహాయము లభించినపుడు



# ఆంధ్రరాష్ట్రంలో మహిళా సంక్షేమం

వారు యీ గడువుకాలము ముగియకుండానే వెళ్ళవచ్చును. వారి జీవితవిధానమునకు కావలసిన సంస్కారము, నైతికబలము, శిక్షణ ఇవ్వబడుతుంది. వారి అభిరుచికి అనుగుణమైన చేతిపని శిక్షణగాని, యితర ఉద్యోగశిక్షణగాని ఇస్తారు.

ఆశ్రయ శిబిరము (Shelter camp) రక్షణ గృహమునకు అనుబంధింపబడి ఉంటుంది. రక్షణ నిలయములో చేరడానికి వచ్చే స్త్రీలను, బాలికలను ప్రథమముగా ఒక నెలరోజులు ఈ శిబిరములో ఉంచి వారిని పరీక్షించి, విచారించి ప్రాథమిక సంస్కారము కలుగజేస్తారు. ద్వితీయ ప్రణాళికా కాలములో మొదటి సంవత్సరములో (56-57) ఒక నిలయమును, రెండవ సంవత్సరములో (57-58) మరొక నిలయమును ప్రారంభించడానికి నిశ్చయింపబడింది. మొదటి ఏడు నిలయములో 30 మందిని, శిబిరములో 10 మందిని చేర్చుకొంటారు. సంవత్సరాంతమున యీ సంఖ్య నిలయములో 90 కి శిబిరములో 30 కి పెరుగుతుంది. కనుక ప్రతి నిలయము 120 మందికి శిక్షణ కల్పించేదిగా ఉంటుంది.

సేవాసదనము (Service Home): ప్రణాళికా కాలములో ఇట్టి సదనములు సంవత్సరానికొక్కటి చొ॥ మొదటి మూడేండ్లలోను మొత్తము 3 ప్రారంభించబడుతాయి. ఈ సదనములు ముఖ్యముగా మహిళా సంక్షేమ కార్యక్రమాలకు చేదోడు వాదోడుగా నుండి, వాటివలన కలుగుతున్న అనుభవములు ఫలితములు గ్రాహ్యము చేసుకొని సాధ్యమైనంతవరకు ఇట్టి మహిళా సంక్షేమ ఆవశ్యకతను తగ్గించుటకు ప్రయత్నిస్తాయి. ఈ సదనములలో సాధారణముగా ప్రవేశము దొరకుట కష్టము. ప్రత్యేకముగా పరీక్షించి, విచారించినమీదట, విపరీత పరిస్థితులకు లోనై నిరాశ్రయులు, నిర్ధనులు, అనాథలు అయిన స్త్రీలను మాత్రమే చేర్చుకొంటారు.

అవివాహితులైన యువతులు సంఘములో దౌర్జన్యమునకు, అవినీతికి బలికాకుండ కాపాడబడతారు. నిరాశ్రయులైన వితంతువులు, భర్తలచే విడువబడిన భార్యలు, పిల్లలు వుండినా, లేకపోయినా తగురీతిగా వారి జీవితములను గూర్చి విచారణ చేసినమీదట యీ సదనములలో చేర్చుకొనబడతారు. వారికి సదనములో ఆశ్రయము, శిక్షణ మూడు సంవత్సరముల కాలము కల్పించబడుతుంది. పబ్లిక్ పరీక్షలకు తరగతులు ప్రారంభించబడతాయి. ఇవిగాక కుట్టు, అల్లిక, చేనేత, వడుకుట, నగిషీ మొదలైనవికూడ నేర్పబడతాయి. గృహాలంకరణ, కుటుంబ ఆర్థికశాస్త్రము (Home Economics), శిశుపోషణ ఇత్యాది విషయములలో కోర్సులు ప్రారంభించబడతాయి ప్రత్యేకముగా అర్హతగల వారికి 'Secretariat course' (సెక్రటరీ శిక్షణ) కూడా ప్రారంభించబడుతుంది.

ప్రతి సదనమునకు శిశుశాఖ అనుబంధముగా ఉంటుంది. ప్రతి సదనములో 160 మంది స్త్రీలు, 60 మంది శిశువులకు ప్రవేశము లభిస్తుంది. ఈ సదనములలో పతితలు, అనాథలు, నిర్ధనలు, నిరాశ్రయులు, వంచితులు, అభాగినులు అయిన స్త్రీలకు, పిల్లలకు ఎంతో రక్షణ, ఆశ్రయము జీవనోపాధి శక్తి కల్పిస్తాయి. ఇట్టి మహిళా సంక్షేమ, సముద్ధరణ నిలయములు ముందు కళానిలయములుగా విలసిల్లి ఆంధ్ర వనితాలోకమును వన్నెకెక్కించుతాయి. ఉత్సాహవంతులు, విద్యావంతులు, సంఘసేవాభిలాషగల స్త్రీలు తమ ఉత్సాహశక్తులు, కళాకౌశలము వ్యష్టిసమిష్టి ప్రయోజనానికుపయోగించే విధంగా చేయడానికి ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలము (1956-61) మంచి తరుణము.

ఇతర సాంఘిక సంక్షేమ కార్యకలాపములలో స్త్రీల సంఖ్య 1956 నుండి 1961 వరకు యీ దిగువ రీతిని పెంపొందచేయుటకు సంకల్పించ బడినది.

| స్త్రీలకు ఉద్యోగములు | 1956-57 | 1960-61 |
|---|---|---|
| 1. పరిపాలనశాఖలు | 468 | 688 |
| 2. సాంకేతికరంగము | 856 | 515 |
| 3. శిక్షితులు, నిపుణులు | 588 | 2,285 |
| 4. అశిక్షితులు, సాధారణులు | 1,060 | 4,494 |
| మొత్తము | 2,417 | 7,927 |



# వాచీదొంగ

(గతసంచిక తరువాయి)

## 3

సూర్యం అన్నయ్యని ఉడిపి హోటలు దాటించి, వెల్కం హోటల్ ప్రక్కనున్న వీధిలోనుంచి తీసుకెళ్తున్నాడు. ఆ వీధిలో 'వెంకటేశ్వర టీ స్టాల్' అని ఒక డొక్కు టీ హోటలుంది. అన్నయ్య వేగంగా నడుస్తున్నాడు. వాళ్లు ఆ డొక్కు 'టీ' హోటలు ముందునుంచి వెళ్తున్నారు. సూర్యంకి దిక్కులు చూడ్డం అలవాటుగనక, యథాలాపనగా ఆ హోటల్లోకి చూశాడు. లోపల దాసీదానికొడుకు "సోమిగాడు" టీ తాగుతున్నాడు. అన్నయ్యా: అదుగో సోమిగాడు, అన్నాడు సూర్యం.

"ఎక్కడరా?" అన్నాడు అన్నయ్య ఆత్రంగా.

"అదుగో ఆ హోటల్లో," అని అన్నయ్య చెయ్యి పట్టుకొని డొక్కు టీ హోటల్లోకి తీసుకెళ్లాడు సూర్యం. రిక్షావాళ్లు, రోడ్డు తుడిచే వాళ్లు, సోమిగాడు — మొదలైన వాళ్ళంతా అక్కడ టీ సేవిస్తున్నారు. "దయచెయ్యండి, ఏమిటి కావాలి?" అని ప్రొప్రయిటరు తన సీటులోంచి లేచివచ్చాడు.

రిక్షావాడు టీ తాగడానికి ఉపక్రమిస్తున్నాడు. అన్నయ్య మంచి బట్టలు చూసి, "ఈ హోటలుకెందుకు వచ్చాడా?" అని సందేహం కలిగి ప్రొప్రయిటరు తన సీటులోంచి అమాంతం లేచి వచ్చాడు. అన్నయ్యని చూడగానే "సోమిగాడు" టీ తాగుతున్నవాడల్లా అమాంతం లేచిపోయి, తను కూర్చున్న బల్లముందున్న టేబిలు మీద టీ గాసునుంచి పారిపోడానికి ప్రయత్నించాడు. అన్నయ్య అడ్డంగా నిలబడి, వాణ్ణి పారిపోకుండా చేశాడు.

"ఏమిటండీ, వీడేం చేశాడు?" అని అన్నయ్యని ప్రొప్రయిటరు అడిగాడు.

"అబ్బే! వీళ్లమ్మ మా యింట్లో దాసీ దానిగా పనిచేస్తోంది. వీడు వీళ్లమ్మమీద అలిగి ఎక్కడికో పోతాన్నాట్ట! అది మా ఇంటిదగ్గర ఒకటే ఏడుపు! నేను ఇలా పోతూంటే వీడు కనిపించాడు. వీడి దగ్గర డబ్బులు తీసుకుని నాతో పంపించండి!" అన్నాడన్నయ్య.

"ఆరి, నీదుంపతెగ, ఇంతపనికి ఏగావా? ఏంబాబుల్లోడా! తప్పు కదూ, మీ అమ్మని కష్టపెట్టటం? ఒరేయ్! వీడెంత ఇవ్వాలి?" అని అవతలవాణ్ణి అడిగాడు.

"రెండు ఇడ్డెన్లు బేక, మరో బేక ఉప్మా, ఒక అణా టీ," అని తనలో తను గట్టిగానే అనుకొని, ప్రొప్రయిటరుతో, "అయిదణాలు," అన్నాడు.

"సోమిగాడు "ఒక రూపాయి నోటు పక్క జేబులోంచి తీసి, ప్రొప్రయిటరు కిచ్చాడు. అతను చిల్లర డబ్బులు మిగతా 11 అణాలుఇస్తూ, "డబ్బులు మా జాస్తిగా వుండాయే, ఈడిదగ్గిర," అన్నాడు ఆశ్చర్యంగా.

సోమిగాడు, వీళ్ళని తప్పించుకుని పోదామని ప్రయత్నించాడు. అన్నయ్య చాల జాగ్రత్తగా వాణ్ణి కనిపెడుతూ ఇంటికితీసుకువచ్చాడు. వాడికి హోటల్లో అన్నయ్య చెప్పినదంతా విన్నతర్వాత, అయోమయంగా వుంది.

అక్కయ్యకి జరిగినదంతా అన్నయ్యా, సూర్యం చెప్పారు.

"ని జేబులో ఎన్నిడబ్బు లున్నాయో, తియ్యి!" అంది అక్కయ్య.

"అబ్బే! నాదగ్గిరేం డబ్బులు లేవండి!" అని అనబోయి, అన్నయ్యను చూసి, పక్క జేబులో

రమేష్ కుమార్

చెయ్యిపెట్టి, ఒక రూపాయినోటు, పదకొండు అణాలు, మూఁడు బీడీలు-తీశాడు.

"నీ కీ డబ్బు లెక్కడివి ?"

"మా అమ్మ ఇచ్చిందండి!"

"ఐతే సూర్యం, నువ్వెళ్లి మన దాసీదాన్ని తిసుకరా! దాన్ని కనుక్కుందాం!" అంది అక్క.

"మా అమ్మ ఇవ్వలేదండి," అన్నాడు సోవిఁగాడు.

"మరైతే ఎక్కడవి నిన్ని డబ్బులు?"

"యీ డబ్బులాండీ — యీ డబ్బులూ—ఆఁ...దొరికాయండి."

"ఊహూఁ...మరిందాకా అబద్ధం ఎందుకు చెప్పావు?"

"ఉత్తినేనండి! మీరు దొరికాయంటే నమ్మరుకదా అని!" వాడు సమర్థించుకున్నాడు.

"వాచీ ఎక్కడ దాచావు?"

"వాచీ ఏమిటండి?"

"పాపం! నీకేం తెలియదేం. నువ్వు ఇందాకా ఈ గదిలోంచి తీసిన వాచీ," అని అన్నయ్య గదిని చూపించింది అక్క.

"ఇవ్వాళ నేనసలుమీయింటికే రాలేదండి. మీ యింటికే రానప్పుడు, నేను వాచీదొంగిలించాననడం ఏం బాగాలేదండి?" వాడు కొంచెం దబాయింపుగా అడిగాడు.

"తగ్గు! దబాయించకు! ఇవాళ నువ్వు మా ఇంటికొచ్చావు! నువ్వే వాచీ తీశావు! సందులోంచి మీ అమ్మదగ్గరకి వెళ్తున్నావు, ఈ గది తలుపులు తీసివుండడం చూశావు. కిటికీలోనుంచి లోపలికి తొంగి చూశావు. ఎవ్వరూ లేరు. గదిలో ప్రవేశించావు. వాచీ తీసుకుని మీ అమ్మదగ్గరకెళ్ళి చద్దిఅన్నం తినకుండా వచ్చిన దోవనే ఉడాయించావు!" అంది అక్కయ్య.

"ఏవిఁటండీ! మీరంతా చూసినట్టు మాట్లాడుతారు. నేనసలు మీ యింటికి రాలేదు మొర్రో అంటే?" అని వాడు కోపాన్ని కొద్దిగా ప్రదర్శించాడు.

"నేను చూడబట్టే అంటున్నాను. నేను నా గదిలో కిటికీలోనుంచి చూశాను, నువ్వు సందులోనుంచి వెళ్తుండగా - నువ్వు అసలు మా ఇంటికి రానేలేదని దబాయిస్తున్నావు?" అని అక్కయ్య రెట్టించిన కోపంతో వాడికేసి చూసింది.

"మీరు చూ-శా-రాం-డీ—" అన్నాడు మాటలు తడబడుతూ వాడు. వాడి ముఖకవళికలు మారిపోయాయి. బిక్కమొఖం వేశాడు. వణికిపోతున్నాడు

"వాచీ ఏం చేశావో చెప్పు? తీసుకొచ్చియిచ్చెయ్! మాతమ్ముడు కూడా నీ వెంట వస్తాడు. నువ్వు కాని ఇవ్వకపోతావో నిన్ను పోలీసులకి వప్పగిస్తాం! వాళ్లు నిన్ను లాఠీ కర్రలతో వొళ్లంతా పచ్చిపుండయ్యేలాగ కొడతారు. తరువాత చీకటికొట్లో పారేస్తారు. తిండి పెట్టరు. ఒరేయ్! నువ్వెళ్లి పోలీసుల్ని తీసుకురా!" అంది అక్కయ్య అన్నయ్యతో.

అన్నయ్య రెండడుగులు ముందుకి వేశాడు.

"అమ్మగారూ! నన్ను పోలీసులకి వప్పగించకండి! మీ వాచీ మీకిచ్చేస్తాను!" అన్నాడు సోవిఁగాడు ఏడుస్తూ.

అన్నయ్య తక్కున ఆగిపోయాడు.

"వాచీ ఎక్కడుంది?" అడిగింది అక్కయ్య.

"వాచీని నేనే దొంగిలించానండి. దాన్ని కోమటి సుబ్బయ్యగారి దగ్గర రెండు రూపాయలకి కుదవబెట్టాను. నా దగ్గర 5 అణాలు తక్కువగా వున్నాయి. మీరు గాని......"

"ఒరేయ్! నువ్వు మరో అయిదణాలు వేసి, మొత్తం రెండు రూపాయలు, ఆ సుబ్బయ్య ఎవడో వాడికిచ్చి వాచీ విడిపించుకరా!" అంది అక్కయ్య, అన్నయ్య చేతికి రూపాయి పదకొండు అణాలూ, "సోవిఁగాడి" దగ్గర తీసుకుని ఇస్తూ.

## 4

అన్నయ్య మొహం కలకలలాడుతోంది. తన చేతికున్న వాచీని సంతోషంతో చూచుకుంటూ, అక్కయ్యని సమీపించాడు.

"అక్కయ్యా! ఆ సుబ్బయ్య ఎవడో గాని, వాడి తస్సాదియ్యా గట్టివాడిలా వున్నాడే! 'ఏడెవడో నాకు తెలీదు. వీడు నా దగ్గర వాచీ కుదవ పెట్టటమేమిటి? నాకు తెలీదు పొమ్మన్నాడు.' అప్పుడు 'సోవిఁగాడు' ఏడుస్తూ, 'ఓ అరగంట క్రితం రెండు రూపాయలకు వాచీ కుదవ పెట్టలేదుటండీ? నా వాచీ నాకివ్వండి, ఇవిగో రెండురూపాయలూ తీసుకుని;' అన్నాడు. సుబ్బయ్య తనకి వాచీ సంగతి తెలియనే తెలియదన్నాడు. వీడికి ఇలా కాదు అనుకొని, 'నిన్ను పోలీసులకి అప్పగిస్తా!' అని వాడిని భయపెట్టి వాడికి మరో రూపాయి ఎక్కువ ఇచ్చుకొని వాచీ తెచ్చుకున్నాను,' అన్నాడు అన్నయ్య మహోఘన కార్యం చేసిన వాడిలా.

"మరి మొదట్లో నన్నెందుకు అనుమానించావు? నన్నెందుకడిగావు వాచీ గురించి," అన్నాడు సూర్యం.

"తరువాత నిన్ను నేను అడగలేదుగా!" అంది అక్కయ్య.

"అక్కయ్యా! నీవు దొంగను ఎలా కనుక్కున్నావు? నీకు కనిపించిన వస్తువేమిటి? సోవిఁగాడిని ఎందుకు అనుమానించావు? నువ్వు తాతయ్య గది ముందర పిల్లలకి హిందీ అక్షరాలు నేర్పుతున్నావు కదా, మరి నీ గదిలో నుంచి 'సోవిగాడు' సందులోనుంచి వెళ్లడం చూశానన్నావు? అది అబద్ధమూ కాదా? అట్లా ఎందుకు దబాయించావు?" అని అన్నయ్య అక్కయ్య మీద ప్రశ్నల వర్షం కురిపించాడు.

"నాకు సందులో నీ గది ముందర మెట్లమీద కనిపించిన వస్తువు బీడీ పీక. మనింట్లో బీడీలు, సిగరెట్లూ ఎవ్వరూ కాల్చరు కదా—అందుచేత ఇక్కడికిది ఎలా వచ్చింది, అనుకున్నాను. బహుశా ఈ బీడీ పీకకీ వాచీ పోవటానికీ ఏమైనా సంబంధం వుండవచ్చు అనుకున్నాను. మనింటికి రోజూ వచ్చే వాడు మన దాసీదాని కొడుకు సోవిఁగాడు. వాడు రోజూ చద్దన్నం తినటానికి సరిగ్గా తొమ్మిది కల్లా తయారవుతాడు. వాడు రెండు మూడుసార్లు పెరట్లో సపోటా

## ★ వాచీ దొంగ ★

చెట్టు దగ్గర బీడీలు కాలుస్తూండగా చూసి మందలించాను. వాడి మీద నాకు అనుమానంవేసి, వాళ్ళమ్మను పిలిచాను. అది వాడింకా చద్ది అన్నం తినటానికి రాలేదనీ, వేళ దాటిందనీ చెప్పింది. వాడిమీద నా అనుమానం దృఢ పడింది నిన్ను వెళ్లి వాణ్ణి తీసుకు రమ్మన్నాను. నువ్వూ సూర్యం వెళ్లారు వాడిని తీసుకు రావటానికి వాడూ-వాడి చర్యలూ గురించి, కాఫీ హోటల్లోని వివరాలు మీరు నాకు చెప్పారు' వాడికి కాఫీ హోటలుకి వెళ్లటానికి డబ్బులు ఎక్కడవి? అని నాలో నేను ప్రశ్నించుకున్నాను. వాచీ ఎవరిదగ్గరో తాకట్టు పెట్టి వుంటాడని ఊహించాను 'నీకీ డబ్బు లెక్కడివి?' అని వాడిని అడిగినప్పుడు - మొదట వాళ్ళమ్మ ఇచ్చిందనీ, తర్వాత దొరికాయి అనీ చెప్పాడు. అబద్ధ మెందుకు చెప్పావంటే ఏదో చెప్పి సమర్థించుకున్నాడు. తరువాత, నాకు కనిపించిన 'బీడీ పీక'మీద 'మూడు గుర్రాలు'న్నాయి. వాడి దగ్గరున్న 'బీడీ పీక' మీద కూడ 'మూడు గుర్రాలే' వున్నాయి. వాడికి బీడీపీక 'గుర్తులు, సాక్ష్యంగా చూపిద్దా మనుకున్నాను. కాని, వాడు మనింటికే రాలేదని దబాయిస్తున్నాడు దబాయింపుకి దబాయింపేమందు అని, 'నేను నువ్వు సందులోనుంచి వెళ్తూండగా చూశానని దబాయించేను' వాడు బిక్క మొఖం వేశాడు. పోలీసులకి వప్పగిస్తానని భయపెడితే, వాడు తను దొంగిలించినట్లు, సుబ్బయ్య దగ్గిర 2 రూపాయలకు తాకట్టుపెట్టినట్లు చెప్పాడు. నువ్వెళ్ళి, వాడికి మరో రూపాయి ఎక్కువగా చెల్లించి వాచీ విడిపించుకొని తెచ్చుకున్నావు," అని అక్కయ్య ఊహించింది, జరిగింది-కళ్ళకి కట్టినట్లుగా చెప్పి, తన ఉపన్యాసం ముగించింది.

"ఈ విషయంలో సూర్యం కూడ మనకి చాల సహాయం చేశాడక్కయ్యా!" అన్నాడు అన్నయ్య. సూర్యం పొంగిపోయాడు. సంతోషంగా నవ్వేడు

"మరి, ఈ 'డిటెక్టివ్'కి బహుమానం ఏ మిచ్చుకుంటావో?" అంది అక్కయ్య

"ఈ నెలాఖరున జీతం అందటంతో నీ కొక వెల్వెట్ జాకెట్టూ, సూర్యానికొకలాగూ, చొక్కా కుట్టిస్తాను," అన్నాడు అన్నయ్య

### మాట వరసకి…'

పాఠశాల వార్షికోత్సవం జరుగుతోంది. ఒక ప్రముఖ వ్యాపారస్థుడు పిల్లలకి నీతులు చెబుతూ ఉపన్యసిస్తున్నాడు.

"చూశారూ పిల్లలూ అందరూ చదువుకోవాలి చదువంత మంచి వస్తువు ఇంకొకటి లేదు. చదువువల్లనే మనకి అన్నీ తెలుస్తా యన్న మాట

"మాటవరసకి లెక్కలు చూడండి. లెక్కలు నేర్చుకుంటే,' మనకి రెండు రెళ్ళు నాలుగని తెలుస్తుంది నాలుగు నాలుగులు పదహారని, పదహారు పదహార్లు...ఏం, ఆ తరవాత జాగర్త ఉందనుకోండి..."

"మాటలనగానే సరిగాదు! అన్న మాట నిలబెట్టుకోవాలి అబ్బాయి గారు!" అంది అక్కయ్య చిరునవ్వుతో.

వాచీ పోవటం, "అక్కయ్య అపరాధ పరిశోధన" చెయ్యటం దొంగ ఎవరో తెలుసుకోవటం, ఇంట్లో ఎవ్వరికీ తెలీదు! పోవటం-దొరకటం అంతా ఒక గంటలో అయిపోయింది! తరువాత ఇంట్లో వాళ్లందరికీ తెలిసింది. దాసీ దానికి కూడ తెలిసింది అందరూ ఆశ్చర్య పోయారు!



బాలసాహితి సీరియల్

# సాగర గర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది సముద్రంలో ప్రయాణంచేసే నౌకల కది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. దానివలన నాగరిక ప్రపంచానికి, ముఖ్యంగా నౌకాప్రయాణాలకి ప్రమాదం సంభవించవచ్చునని అందరూ అభిప్రాయపడ్డారు. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కాన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ మహాసముద్రంలో ప్రవేశిస్తుంది అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగు కనిపించింది ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్లవర్షం కురిపించారు అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా, కాన్సిల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు భోంచేసి అందరూ హాయిగా నిద్రపోతారు. తిరిగీ తను కన్నప్రాణాలు రాలేదని అంతా మథనపడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది. కెప్టెన్ నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరు బయటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు. ప్రొఫెసర్ అరోనా నీమో గదిలో వింతలు విశేషాలు చూచి ఎంతో ఆశ్చర్యపోతాడు

అనువాదం: "వినాయక"

సముద్రగర్భంఅద్దంలా స్వచ్ఛంగా ఉంటుందన్న సంగతి చాలామందికి తెలియకపోవచ్చును.

ఆన్‌టిల్లస్ అనేచోట 75 నిలువులలోతున సముద్రం అట్టడుగు ప్రదేశంలోని ఇసక తళతళలాడుతూ స్పష్టంగా కనిపిస్తూంటుంది. సూర్యకిరణాలు 150 నిలువులలోతు కన్నా లోపలికి పోలేవని అంటారు. అలాంటి సాగర గర్భంలో నాటిలస్ విద్యుద్దీపాలు పడిన ప్రదేశం. పరిశీలిస్తే తేజః పుంజాలే జలస్వరూపం ధరించినట్లుగా మెరిసిపోయాయి!

ఆ విద్యుద్దీపాల సహాయంతో సముద్రాంతరాళంలోని అత్యద్భుత విశేషాలన్నీ చూస్తూంటే నా కళ్లే నేను నమ్మలేని పరిస్థితిలో పడిపోయాను ఆ నాకళ్లకు, జలాంతర్గామికి రెండు పార్శ్వాలలోను రెండు పెద్దపెద్ద జలచరప్రదర్శనశాల లున్నట్లుగా స్ఫురించింది!

బాలగేయం:

# సింహము - గాడిద

ఉత్పల సత్యనారాయణాచార్య

సింహముతో నొక గాడిద
స్నేహంబును కోరి వచ్చె
అందులకా సింహమెంతో
ఆదరమున ఒప్పుకొనెను.

ఆహారము సేకరింప
అపుడు జంతువులు రెండు
ఒకరొకరికి సాయపడగ
ఒప్పందము చేసికొనెను

కావలసిన జంతువులను
గాడిద కొనిరావలయును
సింహమప్పు డవ్వానిని
సంహరించి పంచవలయు

ఈ తీరుగ ఆ రెండును
ఇష్టమైన జంతువులను
పట్టి చంపి మాంసమంత
పదిలపరిచె నొక్కచోట

అంత కొంతసేపటిలో
ఆ సింహము మాంసమంత
మూడు భాగములుగ చేసె
గాడిదతో ఇట్లు లనెను.

"మృగరాజును నేనగుటను
మేర తప్పకుండ నాకు
కానుకగా మొదటి పాలు
గౌరవించి ఒసగవలయు

నేను కూడ నీతోడుగ
నిలిచియుండి వేటాడితి
కావున ఈ రెండవదియు
రావలయును నాకు సరిగ

మంచి చెడుగు లాకళించి
మాఱుమాటలాడకుండ
ఈ మూడవ పాలు కూడ
ఇచ్చివేయవలయు నాకు

నిజము చెప్పుచుంటి నిపుడు
నీ వింతట ఒప్పుకొనుము
లేకుండిన బ్రతుక వీవు
లేచిపొమ్ము ఎటకైనను"

అని సింహము బొబ్బరించి
ఆ గాడిద నంపివేసె!
దుష్టుడైన బలవంతుని
తోడి చెలిమి కూడదుగద!

## ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

నాటిలస్ ఎంత వేగంగా ప్రయాణం చేస్తున్నా ఇరుపార్శ్వాలలోను గుర్తు లేవీ లేకపోవడంవల్ల అది కదులుతూన్నట్లు కనిపించ లేదు.

నేను, కౌన్సెలు, నెడ్‌లాండు జలాంతర్గామి రెండు పార్శ్వాల లోను కనిపించే ఆ అత్యద్భుత దృశ్యాల పరికిస్తూ అలాగే నిర్ఘాంత పోయి నిలుచున్నాము అలాగ కొంత సేపు గడిచినతరవాత కౌన్సెల్ అన్నాడు.

"నెడ్‌లాండ్! నీవేవో విచిత్రాలు చూడాలని అన్నావు! అదిగో! కళ్ళారా ఆ విచిత్రాలన్నీ చూడు!"

నెడ్‌లాండ్ ఇన్నాళ్ళనించీ ఎలాగైనా మా జలాంతర్గామిలో నించి తప్పించుకొని పారిపోవాలని అనుకున్నాడు. కాని ఇప్పుడీ అద్భుతాలవలోకించే సందడిలో ఆ వ్యవహారం అంతా మరిచిపోయాడు.

"ఎంత విచిత్రంగా ఉంది! ప్రత్యేకంగా దీనికోసమని ఈ జలాంతర్గామిలోకి వచ్చినా రావచ్చును!"

"నాకిప్పుడు మానవజీవితం కొంచెం బోధపడింది. మనిషి ఎంతటి చిత్రవిచిత్రమైన ప్రపంచం సృష్టించుకొన్నాడు!" అన్నాను

నెడ్‌లాండ్ "అయితే నాకిటిలో చేప లెక్కడా కనిపించడం లేదే!" అన్నాడు.

"అయితేనేం? నీకు చేపలను గురించి తెలుసునా ఏమన్నానా?" అన్నాడు కౌన్సెల్

"ఆఁ! నాకేమీ తెలియదా? నాకు చేపలనుగురించిన భోగట్టా అంతా తెలుసును!" అని గద్దించాడు నెడ్.

తరవాత ఆవిషయంలో వారిద్దరికీ మధ్యన వాదోపవాదాలు చెలరేగాయి ఇద్దరికీ చేపలనుగురించిన భోగట్టా కొంత తెలుసునుగాని ఒకరికి తెలిసినభోగట్టా ఇంకొకరికి తెలియదు నిజానికి విషయంలో కౌన్సెలుకే ఎక్కువ తెలుసునేమో! అందుచేతనే అది అంత తేలికగా లొంగిపోలేదు.

"నెడ్‌లాండ్! నీవు చేపలవేటలో చాలా గట్టివాడవు చాలా పెద్దపెద్ద చేపల్నే వేటాడావు. అయితే వాటికి సంబంధించిన వర్గీకరణ నీ కేమీ తెలియదు."



నేను, కౌన్సెలు, నెడ్‌లాండు జలాంతర్గామి రెండు పార్శ్వాలలోను కనిపించే అత్యద్భుతదృశ్యాలవలోకిస్తూ అలాగే నిర్ఘాంతపోయి నిలుచున్నాము.

"సాగరగర్భంలో సాహసయాత్ర" ఆంగ్లచిత్రంలో ఒక దృశ్యం..

"తెలియకేం! తినడానికి పనికి వచ్చేవీ, పనికిరానివీ అని వాటిని రెండు ముఖ్యమైన వర్గాలుగా విభజించారు!"

"అది చాలా సామాన్యమైన విభజన అదీగాక అది కేవలం భోజన దురాశదృష్టితో చేసిన వర్గీకరణం. ఇక మిగిలిన వర్గీకరణాల విషయం నీకేమీ తెలియదన్న మాట!"

"తెలియకేం!" అని దబాయించాడు నెడ్‌లాండ్ కాని అవేవీ అతనికంత బాగా తెలియవు.

"అయితే ఆ విభాగాలనుగురించి చెబుతున్నాను. విను! జలచర శాస్త్రజ్ఞులు మొట్టమొదటగా చేపలన్నీ ఆరు విభాగాలుగా విభజించారు" అని కౌన్సెల్ ఆయా విభాగాలనుగురించీ, వానిలోని చేపల జాతులనుగురించీ, ఆయా మత్స్య జాతుల ప్రత్యేక లక్షణాలనుగురించీ ఎన్నెన్నో వివరాలేకరువుపెట్టాడు

నెడ్‌లాండ్ ఆయా చేపల కూరలు రుచులూహించుకొని లోలోపల గుటకలు వెయ్యడం మొదలుపెట్టాడు. అంతేగాని ఆ శాస్త్రీయ వర్గీకరణ అతనికేమీ పట్టలేదు.

తరవాత నెడ్‌లాండ్ జలాంతర్గామిలో అమర్చిన అద్దంవైపు తిరిగి, "అదిగో కౌన్సెల్! చిత్రవిచిత్రమైన చేపలేవో జలాంతర్గామి పక్కనే కదులుతున్నట్టున్నాయి! చూడు! చూడు!" అన్నాడు

"అవును! ఎంత చిత్రమయిన రంగుల చేపలో! మనం అచ్చంగా ఏదో జలచర ప్రదర్శనశాలలో ఉన్నట్టుగానే ఉంది!" అన్నాడు.

"కాదు! కాదు! జలచర ప్రదర్శనశాల చేపల కొక ఇనపకమ్మీల పంజరంలా కనబడుతుంది కాని ఈ సముద్రంలో అవి ఎలాగ పడితే

## ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

అలాగ ఇష్టం వచ్చినట్లు తిరగ వచ్చును!" అన్నాను.

"కౌన్సెల్! ఆ చిత్రచిత్రమైన చేపల పేర్లేమిటో కొంచెం చెబుదూ!" అన్నాడు నెడ్ ఎంతో ఆసక్తిగా వాటికేసి చూస్తూ.

"నేనా? ఆ పేర్ల సంగతి నాకంతగా తెలియదు! కావలిస్తే వర్గీకరణ చెయ్యగలను గాని పేర్లగొడవ నాకేం తెలుస్తుంది. అవన్నీ ప్రొఫెసర్ అరోనాకే తెలియాలి!" అన్నాడు కౌన్సెల్.

కాని నెడ్‌లాండ్ ఎదురుగా కనిపించే కొన్నికొన్ని చేపల పేర్లు గబగబా చెప్పివేశాడు.

నేనొక విచిత్రమైన చేపకేసి చూస్తూ—

"అదిగో ఆచేపపేరు బాలిస్టర్!" అన్నాను.

"అవునవును! అది చైనా బాలిస్టర్!" అన్నాడు నెడ్‌లాండ్.

తరవాత నెడ్‌లాండ్ దానివంశవృక్షం అంతా ఏకరువు పెట్టాడు.

నెడ్‌లాండ్ చెప్పినట్టవన్నీ చైనా బాలిస్టర్ చేపలే! అవి జలాంతర్గామి చుట్టూ చేరి దానితోపాటు ప్రయాణం సాగిస్తున్నాయి. ఆచేపల వీపులు ఒకవిధమైన బూడిదరంగుతో చిత్రవిచిత్రంగా మెరిసిపోతున్నాయి. వాటిమీద మెరిసే బంగారు చుక్కలు సముద్ర తరంగాలలో పైడి తారకల తీరులలో తళతళా మెరుస్తున్నాయి.

వాటి మధ్యన నాకు 'స్కేట్' చేపలు కూడా కనిపించాయి. అవి అప్పుడప్పుడు పైపై కెగురుతూ అతివిచిత్రంగా మెరిశాయి. వాటిల్లో చైనా 'స్కేట్' చేపల జాతులు మరీ కన్నులపండువుగా ఉన్నాయి. వాటి పైభాగాలు పసుపుపచ్చగా మెరిశాయి. అడుగుభాగా తెలుపుగా ఉన్నాయి. అలాంటి విచిత్రమైన చేపలు సముద్రంలో చాలా అరుదుగా కనబడుతూంటాయి.

అలాగ రెండు గంటలదాకా సముద్రగర్భంలోని రంగురంగుల జలచరాలన్నీ మా జలాంతర్గామి వెంటబడివచ్చాయి.

రంగురంగుల మెరుపులతో మా వెంటపడుతున్న ఆ చేపల జాతులలో నా కింకా ఎన్నెన్నో కొత్త కొత్త రకాలు కనిపించాయి. అందులో కొన్ని ఆకుపచ్చని చేపలు! మరికొన్ని నీలిరంగు చేపలు! ఆ చేప లెక్కువగా జపాను సాగరతీరంలో కనిపిస్తూంటాయి. వాటి తలలు మాత్రం తెల్లగా సఫేదులా తళతళా మెరుస్తూంటాయి. మరికొన్నిటి తలలు పిల్లనగ్రోవులలా కదిలాయి. మళ్లీ ఆ చేపల మధ్యన మరికొన్ని చిత్రచిత్రమైన సముద్రసర్పాలు ప్రత్యక్షమైనాయి! వాటి పొడవించుమించుగా ఆరడుగులవరకు ఉంటుంది. ఆ సర్పాల కళ్ళు ముత్యాలలా మెరుస్తూంటాయి

ఆ రంగురంగుల చేపలు, వాటి విచిత్రరూపాలుచూస్తూంటే మాకు కలిగిన ఆశ్చర్యాని కంతు లేదు. సామాన్యంగా ఏదో ఒకరకం కొత్త చేప కనబడగానే కౌన్సెల్ ఆ చేప ఫలానా జాతికి చెందినదని చెప్పివేసేవాడు. వెంటనే నెడ్‌లాండ్ దాని పేరు వెల్లడించేవాడు. నేనా చేపల సౌందర్యంలో తన్మయుడనైపోయేవాణ్ణి!

ఆ చిత్రచిత్రమైన చేపల జాతులన్నీ సజీవంగా నే నెప్పుడు చూడలేదు. నిజానికి చైనా జపాను తీరాలలో ఉన్న చేపల పేరులన్నీ ఏకరువుపెట్టడం మాటలతో పనిగాదు. ఆ చేపలన్నీ జలాంతర్గామి విద్యుద్దీపాలు చూచి వెంటనే దానివెంట పడ్డాయి. ఆవిషయంలో అనుమానమేమీ లేదు. ఆ వెలుగులో వాటి రంగురంగుల శరీరాలు చూస్తూంటే మా కళ్ల ఎదురుగా ఏదో ఇంద్రజాలం జరిగిపోతూన్నట్టనిపించింది!

అంతలోనే మా గదిలో దీపాలు వెలిగాయి. జలాంతర్గామికి రెండు వైపులా ఉన్న అద్దాలు రెండు మూసుకుపోయాయి.

మా నౌకకు రెండువైపులా కనిపించిన అత్యద్భుత దృశ్యాలన్నీ అంతర్ధానమైపోయాయి. అయినా నేనేవేవో కలలుకంటూ నేఉన్నాను. అలాగ కొంతసేపు గడిచేసరికి నా కెదురుగా జలాంతర్గామి నడిపించే యంత్రాలు కనిపించాయి. భారమితి యంత్రం మా జలాంతర్గామి ఇంకా వెయ్యినిలువుల లోతులో ఉన్నట్లు సూచించింది. జలాంతర్గామి అప్పటికింకా 15 మైళ్ళ వేగంతో నడిచిపోతూంది.

కెప్టెన్ నీమో మా గాదిలోకి వస్తాడేమోనని ఎదురు చూచాను గాని ఎంతసేపటికీ అతడు లోపలికి రాలేదు. గడియారం అయిదు గంటలు కొట్టింది. నెడ్‌లాండ్ కౌన్సెలు లిద్దరు వారి గదులకు వెళ్లిపోయారు. అంతలో నాభోజనం వచ్చింది. ఆ భోజనంలో వంటకాల రుచి తిన్న వారికే గాని పై

# మోసగింపబడిన రాజు

పూర్వము ఒకానొక దేశాన్ని ఒక రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతనికి అందమైన ఒక భార్య ఉండేది. వీరిద్దరిచేత ఎంతో మెప్పుబడసిన ఒక సేవకుడు ఉండేవాడు. రాజు, రాణి, తమ ప్రేమ చిహ్నంగా, కొలువులో వుండే ఒక చెలికత్తెను, సేవకుడి కిచ్చి వివాహము చేశారు.

వివాహమైన ఒక సంవత్సరము వరకు, సేవకుడు, అతని భార్య సకల భోగభాగ్యాలు అనుభవించారు. రాజకొలువులో వండే రకరకాల వంటకాలు గూడ తిని ఎంతో హాయిగా కాలము వెళ్ళబుచ్చారు. చివరికి తమవద్దనున్న డబ్బు ఖర్చు చేయడమే గాక, అప్పులు గూడ చేశారు. ఇదివరకే రాజు రాణీలవద్దనుండి చాల డబ్బు తీసుకున్నందువలన, యిప్పుడు తిరిగి అడగటమంటే తలవంపులైంది.

తమవద్దనున్న బట్ట, తట్ట, చెంబు తప్పేలలు అమ్మి ఎలాగో అప్పులు తీర్చారు కాని ఇకముందు జీవితము గడపట మెలాగా అని సందేహము కలిగింది

**బి. యస్. రావు**

మొదట్లో జీవితముమీద విరక్తి కలిగింది కాని, చివరికి ఒక ఆలోచన తట్టి భార్యతో అన్నాడు సేవకుడు "నేను ఒకఆలోచన చేశాను. దానివల్ల రాజుని రాణిని మోసము చేయటమే గాక, వారిని ఆనందపర్చి, మనను, ఇదివరకు ఉన్న గౌరవము కంటే, వెయ్యిరెట్లు ఎక్కువగా చూస్తారు. నీవుమాత్రం సహాయం చేస్తే అదృష్టం పండిందే! భార్యకు తన ఉపాయము చెప్పాడు.

"మనము చచ్చిపోవాలి" అన్నాడు సేవకుడు.

"అయితే నీవు ముందర చావు, నేను చావను" అన్నది భార్య

"నీవు పొరబడుతున్నావు.మనము నటించాలి" అన్నాడు. "నేనుచచ్చినట్లు నటిస్తాను. నీవు వెంటనే రాణి వద్దకు వెళ్లి దుఃఖములో మునిగియుండు. ఆ రాణికి జాలిగలిగి, నా దహన సంస్కారాలకి డబ్బుయివ్వటమే గాకుండా, నా శరీరముమీద కప్పడానికి ఒక పట్టుగుడ్డగూడ యిస్తుంది అప్పుడు ఇంటికి వచ్చిన తరువాత నీవు చచ్చినట్లు నటించు, నేను రాజుదగ్గరికి వెళ్ళి అదే కథ వల్లెవేస్తాను. అప్పుడు నాకు గూడ అదే బహుమానాలు వస్తవి" అన్నాడు సేవకుడు. సేవకుడి భార్య ఈ ఉపాయమునకు చాల సంతోషించి, కథ ప్రారంభించింది.

సేవకుడు, గది మధ్యలో నున్న పట్టామీద, కాళ్ళు మక్కావైపుకు త్రిప్పి పడుకున్నాడు. భార్య అతనిని గుడ్డతో చుట్టివేసింది. జుట్టు విరబోసుకుని, భోరున ఏడూస్తూ రాణి గృహమునకు వెళ్లింది

లోనికి ప్రవేశించి, గుండెలు బాదుకుంటూ, చెప్పలేక చెప్పలేక తన భర్తయొక్క అకాలమరణమునుగురించి చెప్పింది. రాణికి వెంటనే జాలి కలిగింది. వెంటనే ఖజనాదారుని పిలిచి, వంద బంగారు నాణెములు, ఒక పట్టుగుడ్డ యిచ్చి పంపవలసినదిగా ఆజ్ఞాపించింది. చెలికత్తె రాణికి వందనము లర్పించి, మనస్సు శాంతించినట్లు యింటికి వచ్చింది. నవ్వుతూ భర్తవద్దకు పరుగెత్తి తను సాధించిన విజయాన్ని గర్వించి చెప్పింది.

సేవకుడు భార్యను పరుండబెట్టి, భార్య సంపాదించినంత తానుగూడ సంపాదిస్తానని చెప్పి వెళ్లాడు అను

---

వాళ్లకు తెలియడం చాలా కష్టం! ఆ వేళ ఎన్నెన్నో చిత్రవిచిత్రమైన చేపల వంటకాలు తయారుచేశారు. వాటి సువాసనతో నాగది అంతా ఘుమ ఘుమలాడిపోయింది.

నేనా సాయంకాలం అంతా చదువులోను, రాతలోను గడిపివేశాను. ఆ తరవాత ఆ విచిత్ర దృశ్యాలనుగురించి ఆలోచించడం మొదలుపెట్టాను. అంతలో నాకు నిద్ర ముంచుకు వచ్చింది. సోఫామీద పడుకుని హాయిగా నిద్రపోయాను నాటిలస్ జలాంతర్గామి నీల నదీప్రవాహాంతర్భాగంలో పడి త్వరత్వరగా ముందుకు సాగిపోయింది.

—ఇంకా ఉంది.

కున్నట్టుగానే ఒక గంటలో వంద బంగారు నాణెములతోను, ఒక పట్టు గుడ్డతోను తిరిగి వచ్చేడు.

ఇక్కడ ఒక గమ్మత్తు జరిగింది. సేవకుడు రాజువద్దకు వచ్చినప్పుడు రాజుగారు దర్బారులో వున్నారు అది ఆయన వెంటనే, నరాసరి రాణి గృహామునకు వెళ్లి చెలికత్తె చావును గురించి చెప్పి విచారము వెలిబుచ్చాడు.

రాణికి ఎక్కడలేని ఆశ్చర్యము వేసింది. "మీరు పొరపడ్డారు. చచ్చింది సేవకుడు ఒక గంట క్రితమే వాని భార్య యిక్కడ వుంది దుఃఖములో వుంది గాని ఆరోగ్యముగానే వుంది" రాజు నవ్వేడు. "ఇదంతా ఒక వింత గాధ లాగా వున్నదే! తనభార్య చావును గురించి చెప్పకోవటానికి ఒక గంట క్రితమే నా దగ్గరకు వచ్చాడు"

"నేను చెప్పేది, చెలికత్తె చావ లేదు చచ్చింది సేవకుడు నన్ను యితర విధాల మీరు నమ్మించ లేరు అంది రాణి. ఈ విధంగా తగాదా ప్రారంభమైంది. ఒకరి కొకరు తమ మాటే నిజమని వాదించుకొని, పందెములోనికి దిగారు రాజు తన ప్రూలతోటను, రాణి తన చిత్రకళామందిరమును ఇచ్చునట్లు పందెములు వేసుకున్నారు.

చివరికి ఎలాగో ఒక నిశ్చయానికి వచ్చారు రాజు ఒక బంటుని, సేవకుడింటికి వెళ్లి నిజము కనుక్కొని రమ్మని పంపాడు ఇటువంటిది జరుగుతుందని సేవకుడు, అతని భార్య ముందే ఊహించి తయారుగా వున్నారు. సేవకుడి భార్య చచ్చినట్లు పడుకున్నది. బంటు యింటికి చేరుసరికి, సేవకుడు చచ్చిన భార్య పక్కన కూర్చొని ఏడుస్తున్నట్లు చూచాడు బంటు తన సానుభూతి కనుపరిచి చచ్చింది సేవకుడి భార్య అని చెప్పాడు

రాణికి ఆగ్రహాము వచ్చింది. "నేను నమ్మను" అనిఅరిచి వెంటనే తన సేవకురాలిని పంపి, సేవకుడు చచ్చినట్లు సాక్ష్యము తీసుకొని రమ్మంది.

మళ్ళీ సేవకుడు, అతని భార్య తయారుగా వున్నారు. సేవకురాలు వచ్చి, సేవకుడు చచ్చిపడి వున్నట్లు వాని భార్య యింకా ఎగరొప్పలు దిగరొప్పలుతో ఏడుస్తున్నట్లు చూచింది వెంటనే తన రాణి వద్దకు వెళ్లి "చచ్చింది సేవకుడు కాని, చెలికత్తె బ్రతికే యున్నది" అని చెప్పింది

ఈ విధంగా రాజుకు రాణికి తగదా పెరిగింది ఎంత సేపటికి ఒక దోవకు రాలేదు.

చివరకు తనే స్వయముగా వెళ్ళాలని నిశ్చయించు కున్నాడు రాజు రాజు, రాణి, రాజుబంటు, రాణి చెలికత్తె పరివారంతో బయలుదేరారు, సేవకుడింటికి

వీళ్లంతా రావటం చూచి సేవకుడి భార్యకు గుండె తారెత్తింది. కాని సేవకుడు ఉపాయము పన్ని రెడీగా వున్నాడు "మన మిద్దరము చచ్చిపోదాము" అన్నాడు రాజు రాణి అడుగుపెట్టేసరికి, పట్టుగుడ్డలతో కప్పబడిన రెండు శవములు గది మధ్యలో కనపడ్డవి.

"నేను గెలిచాను సేవకుడు మొదట చచ్చాడు. ఆ దుఃఖము భరింపలేక భార్య చచ్చింది."

"అల్లా అయి వుండదు. భార్య ముందర చచ్చింది. తరువాత సేవకుడు" అన్నాడు రాజు. రాజు బంటు, రాణి చెలికత్తె తగాదా ప్రారంభించారు చివరకు రాజు శవములవద్దకు వచ్చి, "మీాఇద్దరిలో ఎవరు ముందు చచ్చారో చెబితే వారికి వెయ్యి బంగారు నాణెములు బహుమానము ఇస్తాను" అన్నాడు

సేవకుడి గుండెలదగ్గర ఏదో అలికిడి అయి, ఒక కంఠము యిలా అన్నది "మొదట చచ్చింది నేను, కాబట్టి అది నాకివ్వండి."

వెంటనే సేవకుడి భార్య రాణి పాదములదగ్గరకు వంగి క్షమాపణ వేడుకున్నది.

ఈ వింతను చూచి రాజుకి, రాణికి కడుపుబ్బ నవ్వు వచ్చింది. సేవకుడు అప్పుడు తన నిజకథ చెప్పి తను పన్నిన వుపాయము చెప్పాడు. రాజుకు అమితానందము కల్గి, వెయ్యి బంగారునాణెములు యివ్వటమే గాక, ఆ రోజునుంచి తన కొలువులో గొప్ప పదవి నిచ్చాడు

★

# గీర్వాణ భాషాభ్యాసం

(10-వ పేజీ తరువాయి)

స్వల్ప విషయము గోరంతలు కొండంతలుగా అభివర్ణిస్తారేమోనని నా భయం!"

అని విదూషకుడు విశ్వంభరశర్మవైపు చూచాడు.

"కొండలు కొండలు ఢీకొంటున్నప్పుడు గోరంతవాణ్ణి నేనేమి విన్నవించగలను మహాప్రభూ!" అన్నాడు విదూషకుడు అతి వినయంగా దోసిలిఒగ్గి నిలబడి గుణాఢ్యుడు మళ్లీ అందుకొన్నాడు

"కేవల రాజ్యతంత్రజ్ఞులే పాండిత్య వ్యవహారాల్లో కలగజేసుకుంటే మరి నేనేమని విన్నవించేది!

ఆరుమాసాల్లో గీర్వాణ పాండిత్యం కలగడమనేది కలలోనిమాట! ప్రభువులదగ్గర ఇచ్చకాలు చెప్పడం నాకు సుతరామునచ్చదు! శ్రైపైన తమ చిత్తం!"

"పరీక్ష పెట్టించండి! నే నారుమాసాల్లో నా ప్రతిజ్ఞ నెరవేర్చి చూపిస్తాను" అని ఎదిరించాడు శర్వవర్మ

"ఒకవేళ నెరవేర్చుకోలేక పోతే?" అని అంతకన్నా తీవ్రంగా ఎదిరించాడు గుణాఢ్యుడు.

"మీ పాదుకల నా శిరస్సుపై ధరించి నిండు పేరోలగంలో మీ కూడిగం చేస్తాను! మరి అయితే నా ప్రతిజ్ఞ నెరవేరిన పక్షంలో మరి తామో!"

అని రెట్టించి కవ్వించాడు శర్వవర్మ.

"నా మాటే నా మీద నేడి?"

"అవును! మీ మాటే!"

"నేనా? నా మాట తప్పినపక్షంలో సంస్కృత ప్రాకృతాది ఆర్యభాష లన్నిటిలోను చేసే నా కవితావ్యాసంగం యావత్తు విసర్జించి కేవలం అనార్యమైన పైశాచీ భాషలోనే నా వ్యాసంగం సాగిస్తాను! సరేనా!" అని తిరిగీ గర్జించాడు గుణాఢ్యుడు! అనంతరం కొంతసేపటి వరకు ఆ అతడా భావోన్మాదంలో పడి అలాగే రొజుతూ కూర్చున్నాడు

అంతలో విశ్వంభరశర్మ అందుకొన్నాడు.

"సార్వభౌమా! ఈ వ్యవహారం అంతా నాకేదో నేలవిడిచిన సాములా తోస్తూంది ఇంతకీ ఈ గీర్వాణభాషాభ్యాసం చెయ్యవలెనని కుతూహలం కలిగింది తమకేనా?"

"అవును చక్రవర్తిమాటే! వారివంటి అనన్య సామాన్య ప్రతిభావంతులకీభాష ఆరుమాసాల్లో సాధించడం ఒక లెక్కా!" అన్నాడు శర్వవర్మ

"నావంటి మందబుద్ధికి పన్నెండేళ్లు సాధించినా ఆ భాష పట్టుబడక పోవచ్చును! ప్రభువరేణ్యులకారుమాసాలెందుకు? ఆరు రోజులు చాలవా? జగతీచక్రం చిటికెన వ్రేలితో తిప్పగలిగిన ఏలినవారికి స్వల్ప విషయం ఒక లెక్కా!"

అని పకపకా నవ్వాడు.

దీనితో గుణాఢ్య మంత్రికి గొంతులో పచ్చి వెలక్కాయ చిక్కు పడ్డట్లయింది.

విదూషకుడు విసిరినమాట అంతరార్థం అతనికప్పుడే అవగాహనం కావడం మొదలు పెట్టింది తానీవిషయంలో కొంత తొందర పడ్డానేమోనని అనుకొన్నాడు ఇంతవరకు అతనికి చక్రవర్తికీ నూతన భాషాభ్యాస కుతూహలం కలగడానికిగల కారణమే తెలియలేదు. అయితే దీనిలో ఏదో మహత్తరమైన అంతరార్థం ఉండి తీరాలని అనుకున్నాడు ఇక తొందరపడకూడదని నిశ్చయించుకొన్నాడు

అంతలో విదూషకుడు తిరిగి చక్రవర్తి కంజలి ఘటించి—'నాదొక్క మనవి!' అన్నాడు.

చక్రవర్తి అతనివైపు చూచి బొమముడి విరిచాడు:

"తాము ఆరుమాసాలపాటు అధ్యయనం చేసిన అనంతరం తమకు గీర్వాణవాణీ పాండిత్యం కలిగిందో లేదో నిర్ణయించే ప్రాడ్వివాక గౌరవం నాకిప్పించాలి!"

విశ్వంభరశర్మకు, సంస్కృత పాండిత్యానికీ సగమెరుక! అందుచేత అందరు అతని మాట విని అలవోకగా నవ్వారు. కాని గుణాఢ్యుడు పెదవి కదపలేదు అంతలోనే శర్వవర్మ తిరిగి అందుకొని "దానికేమి! గుణాఢ్యామాత్యులు నిర్ణయించిన విద్వాంసు లెవరినైనా పరీక్షాధికారులుగా నిశ్చయించి ఈ విషయంలో జయాపజయాలు నిర్ణయించుకోవచ్చును." అన్నాడు.

"దానికి నే నంగీకరించేది లేదు!" అన్నాడు విదూషకుడు.

"ఎందుచేత?" శర్వవర్మ ప్రశ్నించాడు.

"ఎందుచేత నేమిటి? గుణాఢ్యామాత్యులు నియమించిన విద్వాంసుడు చక్రవర్తి ఎంత శ్రమపడి పరించినా, ఏమీ పాండిత్యం కలగలేదని నిర్ణయించడం తథ్యం! చక్రవర్తి చిరకాలంనించీ నన్ను కేవలం విద్యాగంధంలేని అజ్ఞుడని అంటున్నారు! పరీక్షాధికారినైన తరవాత నేనే వారికా అజ్ఞతానుహోగౌరవం కలిగింతామని సంకల్పించాను!"

అని చక్రవర్తి కేసి చూచి వికటబడి నవ్వాడు. అటుపిమ్మట మరి అక్కడఉన్నవా రెవరు నవ్వకుండా ఉండలేకపోయారు!

—సశేషం.

# ★ శ్రీమతులు - శ్రీయుతులు ★

(27-వ పేజీ తరువాయి)

నళిని ఇది డబ్బుకు సంబంధించిన విషయం కాదు పూరుకోవడానికి పరువు మర్యాదలకు సంబంధించిన విషయం యిది ఎందుకూ పనికిరానివాడికి ఎక్కువ డబ్బు యిచ్చి నన్ను అవమానిస్తాడా? చూస్తాను- మీ నాన్న సంగతి (సావిత్రికేసి సీరియస్‌గా చూస్తూ) ఇదిగో అమ్మాయ్ చెబుతున్నాను విను ఈ రాత్రి బండిలో తిన్నగా పుట్టింటికి వెళ్ళిపో! మిగిలిన బేలన్సు రెండు వేల రూపాయలు పట్టుకొనివస్తేనే తిరిగిరా! లేదా చస్తే నిన్ను యీ యింట్లో అడుగు పెట్టనివ్వను

సావిత్రి · అయ్యో యిదియెక్కడి అన్యాయమండి! (ఏడుస్తుంది)

(ఎడమవైపునుంచి తొందరగా రాజ్యం వస్తుంది)

రాజ్యం : ఏం సావిత్రీ? నువ్వింకా చీర మార్చుకోలేదా? (ముఖంకేసి చూసి) అరె! ఏడుస్తున్నావేం? (ఆమె భర్తతో) ఏమండీ! ఏడుస్తున్నదేం? మీరేమైనా అన్నారా?

నళిని. (తడబడుతూ) అబ్బే! ఏంలేదండి వటినే

రాజ్యం (గట్టిగా) వటినే ఎవరైనా ఏడుస్తారటండీ? మాటాడవేం సావిత్రీ! ఏం జరిగిందో నాతో చెప్పు

(నళిని చెప్పవద్దని సావిత్రికి సైగచేస్తుంది)

సావిత్రి (గద్గద స్వరంతో) ఏంలేదు ఏదో మా స్వంత విషయం.

రాజ్యం అనేం లాభంలేదు. ఏం జరిగిందో నువ్వు చెప్పితీరాలి

సావిత్రి (సంశయిస్తూ) మరేమో మా చెల్లికి పెళ్ళి. కుదిరిందట!

(నళిని ఖంగారుపడుతూ వుంటుంది)

రాజ్యం. దానికేం? దివ్యంగావుంది

సావిత్రి అదే యిప్పుడీ గొడవకు కారణం!

రాజ్యం అదేం? మీ ఆయనకు యీ పెళ్ళి యిష్టంలేదా?

సావిత్రి ఉహుం! అదికాదు. మా నాన్నగారు చిన్నల్లుడికి ఐదువేలు కట్నం యిస్తున్నారట! నన్ను పెళ్ళిచేసుకున్నందుకు వారికి మూడు వేలే కట్నం యిచ్చారు.

రాజ్యం ఇస్తే ఇప్పుడేమయ్యింది?

సావిత్రి వీరికికూడా మొత్తం అయిదు వేలు యిస్తేకాని వీల్లేదంటున్నారు.

రాజ్యం నాన్సెన్సు! అసలు కట్నం ఘోరమైన దురాచారం దాని నిర్మూలనకోసమే మేం పాటుబడుతున్నాం (నళినితో) ఏమండోయ్, యిటువంటి దౌర్జన్యాలను ఈ పవిత్ర భారత దేశంలో మేం యిక కొనసాగనివ్వం (నళిని మీదికి వెళ్ళి) ఇక మీ మర్యాదను మీరు కాపాడుకోవాలి మళ్లీ కట్నం విషయం మాటాడారా? మా మహిళాసంఘం సభ్యురాండ్రంతా మీ యింటిమీదికి దండయాత్ర ..

(సరిగా యీ సమయంలో కుడిచివర గంగాభవాని కనిపిస్తుంది)

గంగా (ఆత్రుతతో) అయ్యో! అయ్యో! చెట్టంత మొగాణ్ణి అలా కొట్టబోతున్నారేమిటమ్రా!

(అంతా ఒక్కసారి భయంతో అటు తిరుగుతారు నళిని భయంతో వణుకుతూ వుంటుంది పురుష వేషంలో వున్న నళినిని గంగాభవాని గుర్తించలేదు ఎడమ వైపు నుంచి తొందరగా సుమిత్ర వస్తుంది)

గంగా (అందరికేసి మాస్తూ) ఒక్కరూ మాటాడరే మ్రా!

సుమిత్ర : ఏమీ లేదండి నాయనమ్మగారూ నాటకం రిహార్సల్సు వేస్తున్నాం

గంగా అయ్యో ఖర్మ! నాటకాలు కూడా వేస్తున్నారటమ్రా! — కానీ! మీరెలా తగులడితే నాకేం మా నళినిని యిలా పిలవండి!

రాజ్యం మీ నళినా? యిక్కడకు రాలేదే!

గంగా. ఏమమ్మోయ్! అలాంటి వేషాలు యీ గంగాభవానీ దగ్గర పని చెయ్యవు. ముందు దాన్నిలా పంపండి

రాజ్యం మీరు నమ్మకపోతే మేం ఏం చెయ్యగలం?-కావాలంటే మీరు నిరభ్యంతరంగా ఈ యిల్లంతా వెతుక్కోవచ్చు

గంగా. ఓహో! సంసారాలు విడదీసి నాటకం ఆడడంకూడా ప్రారంభించారూ!- వుండండి చెప్తాను

(ఎడమ వైపు నిష్క్రమిస్తుంది)

నళిని : (నెమ్మదిగా) నాకు భయంగా వుందండి

సావిత్రి : (రహస్యంగా) ఆవనాలు పట్టలేదు మరెం ఫరవాలేదు వూరుకో

(గంగాభవాని ఎడమవైపు నుంచి తిరిగి వస్తుంది)

గంగా ఏమైపోయిందమ్రా! ఎక్కడా కనిపించదు ఎక్కడదాచారో చెబుతారా? లేదా?

రాజ్యం : మీ బాధ పడలేక ఆమె ఏ నూతిలో దిగిందో!

సావిత్రి : ప్రాణం విసిగి ఏ సముద్రంలో దిగిందో పాపం!

రాజ్యం : తొందరపడకండి నాయనమ్మగారు! పోలీసులకు రిపోర్టు యిద్దాం

గంగా : అది అంత మాత్రానికి చచ్చేది కాదు నాకు తెలుసును మా సుబ్బమ్మగారింటి దగ్గర కూడా చూస్తాను

(గంగాభవాని కుడివైపు నిష్క్రమిస్తుంది)

నళిని. హమ్మయ్య! భయంతో నా గుండెలు యింకా కొట్టుకుంటున్నై.

రాజ్యం. (నళినితో) ఏమండి పెళ్లికొడుకుగారు! మీ కట్నం సమస్య ఎంతవరకూ వచ్చింది?

నళిని : (మీసం, టోపీ తీసి వేస్తూ) మా అత్తరావడంతో అన్ని సమస్యలూ ఎగిరిపోయినై

(అందరూ గొల్లున నవ్వుతూ వుండగా- తెర)



—అయిపోయింది.






Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S Sambhu Prasad

